శ్రీరస్తు

# జయవర్ధనుడు





కృతికర్త:

చిలుకూరి లక్ష్మీపతిశాస్త్రి

వెల: 14 అణాలు

ఇందలి ద్వితీయముద్రణాదిసర్వాధికారములు
గ్రంథకర్తవే.

వలయువారు:—

చిలుకూరి లక్ష్మీపతిశాస్త్రి, మార్కండపాడు.
చాగల్లుపోష్టు,
పశ్చిమగోదావరిజిల్లా.

1949 — ప్రతులు, 500.

పబ్లిషరు:

బులుసు వెంకటశాస్త్రి. ప్రొప్రైటరు

శ్రీశారదాముద్రణాలయము, భట్నవిల్లి. అమలాపురంతా॥



# శ్రీ గురుమూర్తయే నమః.

బ్రహ్మశ్రీ చిలుకూరి లక్ష్మీపతిశాస్త్రిగారిచే రచియింపఁబడిన "జయవర్ధనుఁడు" అను పద్యకావ్య మామూలాగ్రముగాఁ జదివి యానందించితిని. ఇందలి యితివృత్తము కల్పితమయ్యుఁ బురాణగాథ వలెఁ గన్పట్టుటయే కాక కవితాపద్ధతియందు నవీనరీతు లున్నను బ్రాయికముగాఁ బ్రాచీనమహాకవులరీతులే కనఁబడును. శాస్త్రిగారి సంస్కృతాంధ్రభాషల నొనర్చిన పరిశ్రమవిశేష మడుగడుగునఁ దోఁచు చున్నది. భాషాశుద్ధియు, రససిద్ధియు సర్వత్ర యేకాకారముగా మెఱయఁ గూర్పు నేర్పుగల యీ యువక కవిమణి యింతటితో లేఖిని నాఁపక మేల్తరము లైన కావ్యకుసుమమాలికల నింకను రచించి యాంధ్రశారద నలంకరించి యాయమ్మ యాశీర్వచనముల నితోభి వృద్ధి నొందుఁగాక! యని యాశించుచున్నాను.

ఇట్లు,
"విద్వత్కవిశేఖర,
కవితాభూషణ"
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

అమలాపురం
20—7—49



## హృదయము.

సాధారణముగాఁ గవి తన కావ్యమునకుఁ బేరు పెట్టుటలోనే యొక క్రొత్తదనము కనఁబడుచును. పేరునుబట్టి "యీ జయవర్ధనకృతి" నూతనకల్పనామనోజ్ఞ మైనది. ధోరణినిబట్టి ప్రాక్తనప్రబంధపుఁదీరు గలది. ఇందలి కవిత్వ మొకప్రవాహమువలెఁ బోవుచు మన తెనుఁగు ప్రబంధముల వర్ణనాదుల ఛాయలు నడుమ నడుమ ఘట్టములై తలఁపులకుఁ దగులును. సంగీతకళలోఁ గూడ నీకవిగారికి ప్రేమ—కూర్మి కలద న్నట్లు తృతీయాశ్వాసము మూదలించును. అమాంతము—హేమించెనే—

ముస్తాబు. ఈ మొదలగు వాడుకలు కవిగారి స్వతంత్రగ్గా సూచించుచున్నవి. కథ రుచిరముగా కవిత్వము కథ కనుగుణముగా నుండఁజూచి యీ కావ్య మిట్లు తెనుఁగువారి కిచ్చిన శ్రీశాస్త్రిగారిని మనసార నమస్కరించుచున్నాను.

రాజమండ్రి
౪-౭-౧౯౪౯

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి,
అధ్యాపకులు
వీరేశలింగోన్నతపాఠశాల.

శ్రీరస్తు.

# మనవి.

ఆర్యులారా!

ఈ జయవర్ధనకృతి నాకవితావల్లరిఁబూచిన తొలికుసుమము. దీని రచనాపద్ధతులను గూర్చి నే చెప్పికొనతగినంత విశేషము లేవియు లేవని యెఱుఁగుదును. చెప్పదలంచుకొనను లేదు. దీన ప్రప్రథమప్రయత్నకృతం బగుట కొన్ని దోసంగు లేర్పడినవి. వాటి నెల్ల శ్రమ యని తలపోయక "కవితాభూషణ, విద్వత్కవిశేఖర" బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పరిష్కరించి చూపిరి. అయినను ముద్రణాదిదోషములు కొన్ని దిగజారినవి. అరసున్నలు బుద్ధిపూర్వకముగ విడచిపుచ్చితిని. అఖండయతుల కొన్ని వాడితిని. దీనిని పెద్దలు గ్రహింపకుందురుగాక! ఈవిషయములో నాయం దమితాదరముఁజూపిన శ్రీశాస్త్రిగారికిన్ని, నాయీ గ్రంథమందలి తమయభిప్రాయ మొసంగిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికిన్ని నా కృతజ్ఞతాపూర్వకవందనశతంబుల నర్పించుచున్నాను.

ఇట్లు, గ్రంథకర్త.

# ఇష్టదేవతాప్రార్థన.



శా. శ్రీ రమ్యంబగు వక్షమందెసగ నా శేషాహి శయ్యావిధం
బా రాత్రింకరుఁడు న్దివాకరుఁడు నేత్రాభ న్దలిర్పంగ నా
క్షీరాంభోనిధి పవ్వళించుతలమై చెన్నొందు వెన్నుండు స
ద్ధారాళంబగు కూర్మి స్వర్గతుని మాతండ్రి న్కటాక్షించుతన్. 1.

మ. గణనాథుండు సమస్తకార్యచయవిఘ్నఘ్నుండును విద్యాదుల
న్గణనీయుండు నుమాసతీప్రియమన. కంజాతమార్తాండుఁడు
న్గణనాతీతుఁడు లేఖనారయమున న్దన్త్యాస్యుఁడై యుప్పు నా
రణకోలాహలకోవిదుండు కృతి సంరక్షింప బ్రార్థించెదన్. 2.

ఉ. వీణియ జేతబూని పతివీనుల కింపుగ నైగమంబులన్
పాణితలాన నంటుచు నపారమృదూక్తిని బాడ నాజగ
త్ప్రాణపరాయణుండు సతి రాగము బెంపున గౌగలింపగా
వాణియు నవ్వుచున్ తనకృపామృతదృష్టిని నన్ను గాంచుతన్. 3.

ఉ. గౌరివివాహవేళ శితికంఠుని హస్తము చేతనొప్పు త
ద్వారితనాగముం గనుచు భామిని భీతిలి, బాపుకొంటకై
చేరి "నమశ్శివాయ" యని సిగ్గిలు చేసతి భర్తృనామమున్
చా రమణీమణి న్గొలుతు నాదరమేదురబుద్ధిభాసనన్. 4.

చ. కుముదిని రేనికి న్భగిని గోపకుమారకుముద్దురాణి మే
ల్కమలములన్వసించు కలకంఠి మనోజునిగన్నతల్లి యా
హిమగిరిరాజకన్యకకు నీడునుజోడగు బోటి మేటియా
కమల మదంబ నన్ను కృప గావగ నెప్డు నమస్కరించెదన్. 5.

# పూర్వకవిస్తుతి.

సీ. వల్మీకసంభవ వ్యాసభట్టారక
మునిచంద్రులను ముందు ముదముతోడ
శ్రీహర్షకవిరాజశేఖరుం డమరుక
భట్టి భోజుల జాల భక్తితోడ
కాళిదాసమయూర కాదంబరీకార
శంకరమాఘుల శ్రద్ధతోడ
భవభూతి భారవికవిచంద్రు బిల్హణు
నిత్యంబు నిర్మలనియతితోడ.

తే. గీ. మనమునందున నెంతేని మనన జేసి
వీరి యపురూపభావనాపీఠి బట్టి
యరుగదలచెద నెందేని నెరసు లున్న
దిద్దు డివె వందనములు సుధీంద్రులార! 1.

ఉ. ఎన్నదు నాంధ్రసత్కవుల నెంతయు భక్తిని పూజ్యులైన యా
నన్నయభట్టు దిక్కకవి నాచనసోముని యెఱ్ఱనార్యునిన్
గ్రన్నన నైషధాదికృతికర్తను పెద్దన వీరభద్రసం
పన్నుల కూచిమంచికవిపార్థివు తిమ్మన రామకృష్ణులన్. 2.

చ. అతులితధారగల్గి యలరారెడు నేటి కవీంద్రులందు మేల్
స్తుతమతి యైన యాంధ్రకవిభూషణు శ్రీపదకృష్ణమూర్తి యు
ప్రతిమవిశేషకల్పనల వ్రాసెను భారత మాదిగా పర
శ్శతవరగ్రంథరాజముల సత్కవి నాతని సన్నుతింపనే. 3.

ఉ. మెత్తని పాక మొప్ప నిట మేలని పెద్దలు మెచ్చ జూడగా
నుత్తమకావ్యము ల్సలిపి యున్నతకీర్తి గడించి మించి వి
ద్వత్తమసత్సభన్ శతవిధానవధానము లెంచి జూపు శ్రీ
మత్తిరుపత్యభిఖ్యు మతిమంతుని వేంకటశాస్త్రి నెన్నెదన్. 4.

చ. నిరతసుఖాన్నదాతయును నిర్మలచిత్తయశోవిశారదుం
డురుతరభావశాలియు మహోత్తమశీలుడు పండితాళి నా

దరమున గారవించెడి బుధప్రవరుండు స్వకర్మనిష్ఠుడన్
బఱగెను నాకు దండ్రి పరిపక్వపుపుణ్యవశంబు పెంపునన్. 5.

ఉ. పెద్దలయందు భక్తియును పిన్నలయం దనురక్తి ధర్మమం
దద్దలు లేనిసక్తి పరయాంబుజనేత్రలపై విరక్తి పెం
పొద్దికగా ప్రసక్తి యనునొప్పని నాదముల నిత్యముక్తి యిం
కెద్దియొ యుక్తి గల్గు పిత కెందుల కందవు? ముక్తిమార్గముల్.

తే. గీ. విధినిషేధకార్యంబుల విశదపఱచి
జ్ఞాన మిడజాలు గ్రంథసంస్కార మిచ్చి
పరుల సేవింప నక్కఱపాటులేని
శక్తి బ్రతుకగా జాలు నుపాధి నిచ్చె 6.

తే. గీ. నట్టి తండ్రియు నాచార్యు డైనవాని
నరయ చిలుకూరివంశవిఖ్యాతి కొక్క
నూతనకళ నిడిన యట్టి పూతచరితు
ఘనుని సూర్యప్రకాశశాస్త్రిని దలంతు. 7.

ఉ. రాతిరి యంచు నెంచక నరాతికినైనను జాలి బుట్టు నా
రీతిని భర్తృసేవ లొనరింపుచు నచ్చెడిపోవువారికిన్
చాతురిమీఱగా మధురసంబుల నూర్చెడి యన్నదాన మ
త్యాతతరీతి జేసి పరమార్థముగొన్న మదంబ నెన్నెదన్. 8.

ఉ. చండతరప్రభావిభవచాతురి శాబ్దమునందు సాహితీ
ఖండనమందున న్నెఱపి వాదనతాడనముం బొనర్చి యు
ద్దండు లటంచు బేర్గనిన ధన్యుల పుత్రుల గంటివమ్మ మా
ర్కండపురీవరంబ నుతరాజితకీర్తి సదావలంబమా. 9.

క. శ్రద్ధను కావ్యాదుల నే
యుద్ధవమునగాని జదువనోపను విద్యా
వృద్ధుల సత్కృప కవితా
పద్ధతి నొక్కింత నేర్చు బహుసాహసినై. 10.

---

# తప్పొప్పులు.

| తప్పు. | | ఒప్పు. | | పేజీ. | పంక్తి. |
|---|---|---|---|---|---|
| చోటకును | ... | చోటునకు | ... | 4 | 13 |
| కకంణం | ... | కంకణం | ... | 10 | 7 |
| యరుంగని | ... | యెఱుంగని | ... | ,, | 22 |
| జారులు | ... | జాణలు | ... | 13 | 9 |
| తుది | ... | మది | ... | 14 | 14 |
| ముఖ | ... | ముఖ | ... | 18 | 4 |
| నోకించుక— పరిచయంబు | ... | నోకించుక దనరు పరిచయంబు | ... | 21 | 15 |
| జంత్రిముల | ... | జంత్రిమ్ముల | ... | 22 | 8 |
| ఝుది | ... | ఝువి | ... | 28 | 4 |
| భూమిని | ... | భామిని | ... | 29 | 11 |
| ఘాతములు | ... | ఘాతముల | ... | 35 | 4 |
| అంగుళీని | ... | అంగుళిని | ... | 49 | 21 |
| జహూంకరించి | ... | బహూకరించి | ... | 55 | 7 |
| నెన్నడు గార వింతునో | | నాతఁ గారవింతునో | ... | 61 | 17 |
| చాపి | ... | జాపి | ... | 64 | 1 |
| సమాశ్రిము | ... | సమాశ్రియము | ... | 66 | 23 |

# జయవర్ధనుఁడు.

## కథాప్రారంభము.

### ప్రథమాశ్వాసము.

చ. తలరెను పట్టణం బొకటి యార్యజనావృతపుణ్యభూమియై
మలగెడి గౌతమీనదికి మందల, చంతనవృక్షశాఖలన్
లలితలతావితానములు రమ్యముగా జెనవైచి వీధులం
గలమగ క్రొత్తయంద మొడిగట్టినదై కమలాపురం బనన్. 1.

ఉ. ఆపురగోపురప్రకరహర్మ్యసమంచితచంద్రకాంతకాం
తోపలజాలనిర్మితమహోత్తమచిత్రకళాతివైభవం
బేపుగ నెన్ని జెప్పుటకు నేమహనీయకవీంద్రుడైన దా
నోపను నే నటంచు దిగు బోష్ప దటంచు విరాము నందితిన్. 2.

సీ. వేదార్థములయందు విధి నైన యొకడంచు
వేత్రలైన మణవరు విప్రవరులు
పరశురాముని మేటి పౌరుషవంతుండై
ధర్మంబు లేదండ్రు ధరణివిభులు
ధనదునిమించెడి ధనికులై యుండియు
ధనదులై యుండిరి వణిజు లచట
హరిపూజలను జేసి హాలకర్మ మొనరించి
యులరుచుండెద్ద రందు సంఘిభవుల

తే. గీ. ఇట్టి జగదేకనుతి కాటపట్టురీతి
బఱఁగి వర్ణధర్మంబుల బట్టు విడక
కమల కావాసమై యెల్ల గతుల మించె
కమలలోచను పరిపూర్ణకరుణ వశసి. 3.

వ. ఆ పట్టణంబున.

ఉ. ఉండెను విష్ణువర్ధను డనూనధరామరవంశజాతు డా 4.
ఖండలసంపద నళినగర్భజునీడగు విద్య గల్గియు
ఖండితసర్వముం గలుగు కాతరుపోలిక కుందుచుండు ను
ద్దండదురంతదుఃఖమునుగదా! కుల సంతతి లేనివారికిన్. 5.

ఉ. చేసెను లోకము ల్మెచ్చులు సేయఁగ నెద్దియొ పుణ్య మంచు నా
చేసినదానికి న్ఫలము చేకురదాయె నికేమి జేయు నా
భూసురవర్యుఁ డిట్లదని భూరివిచారము నూనియుండు నే
దోసము జేసి నేనెఱుగ తొల్లిటినుండి కుదేమి కర్మమో. 6.

ఉ. అట్టుల విష్ణువర్ధనుడు స్వాంతమునందున దుఃఖసాగరం
బట్టిటు నీదుచుండ నపు డాతని పుణ్యఫలంబు పెంపున
నిట్టి యొకానొకంఁడు చనుదెంచెను వాని గృహాంగణద్వారత
త్పట్టణరాజమార్గముఖవర్తితమై దనరారుచుండఁచేన్. 7.

సీ. నెఱి మీఱు రుద్రాక్షనీలకాంతిచ్ఛట
కాలకంఠత్వంబు లీల దెలుప
మెడయందు వ్రేలాడు నిడు పైన జడ లవ్వి
గంగాధరత్వంబు గరపుచుండ

సారంగచర్మసంసర్గ మెంతయు కృత్తి
వాసస్త్వముం దేటపరచుచుండ
భూతిలేపనరుచిస్ఫీతమౌ దేహంబు
ధవళదేహత్వ మెంతయును దెలుప.
తే. గీ. అక్షమాలను చేదాల్చి యక్షయముగ
జపము జేయుచు బ్రాహ్మతేజంబు లొలుక
భూమి కేతెంచినట్టి శంభుండువోలె
విష్ణువర్ధను గృహము బ్రవేశమయ్యె. 8.

కం. ఎదురుగ జని భూమిసురుం
డదనం బగు భక్తితోడ నర్చన లిడి బా
ముదమున యతిని న్దోడ్కొని
పదిదినములపాటు నింట భక్తి భజించెఁ. 9.

వ. తదనంతరంబున నాపరివ్రాజకుండు ముదితాంతరంగుండై విష్ణువర్ధ
నున కిట్లనియె.

కం. మెచ్చితి నీగుణగణముల
హెచ్చుగ సంతోష మయ్యె నయ్యెడ మనమున్
సచ్చరితాన్వయసంభవ!
యిచ్చెద నేదేని గోరు మిచ్చో ననఘా. 11.

వ. విష్ణువర్ధనుం డిట్లనియె. 12.

ఉ. పుట్టితి గొప్పవంశమున బొందితి సంపద లెన్నొ మీకృపన్
గట్టిగ శాస్త్రములు జదువగల్గితి జేసితి నెన్నియేని యా

పుట్టువు సంపద నేకొలఁది బుద్ధికి దోపదు లోప మొక్కటే
పుట్టరు నాకు పుత్రికలు పుట్టకపోదురొ! యంచు కుందెదన్. 13

కం. మంత్రమునో, శుభకర మగు
తంత్రమునో దేని నొకటి తత్ఫలదాయిన్
మంత్రణము జేసి దెల్పుము
మంత్రిజ్ఞా! నరకబాధ మలపగవలయున్.

వ. అని వివిధంబుల దేవులాడు విప్రవర్యుం గాంచి. 15

కం. అయ మెంచి యమ్మహాత్ముఁడు
దయతోడుత నొక్క ఫలము ధరణీసురునకున్
దయచేసి దీని నీదా
దయితకు దిన నిమ్ము కల్గు తనయుం డనుచున్. 16

కం. ఇచ్చియు ఫల మారీతిని
వచ్చినచోటకును బోయె నయమున యతియున్
సచ్చారిత్రుఁడు దానిని
మచ్చికతో సతికి నిచ్చె మదవతి కంతన్. 17

కం. నెల దప్పెను కులసతి కపు
డెలమిని వేవిళ్ళ వొడమె నేవస్తువునన్
కలుగదు రుచి చిత్రంబుగ
నెలమొక నెమ్మోము మిగుల వెలవెలబారెన్. 18

కం. నలు పయ్యె చూచుకంబులు
తళతళ చెక్కిళుల దోచె తన్వీమణికిన్

తిలకింప నయ్యె మధ్యం
బలసటయు నిశ్ఛిద్ర యధిక మాయెం గ్రమమై. 19.

కం. నవమాసంబులు మోసెను
పరివిమలనక్షత్రయుక్తబలసంపత్తుల్
జివ యగు గ్రహములు గూడిన
దినమందున సుతుని గనియె తేజము లొలుకన్. 20

కం. బాలుం డందమునందున
జాలున్ డిందుగ నొనర్ప జంద్రాదుల నా
జాలడె! యొక్కం డిట్టిను
నేలా? పదివేలమంది యెడ్డియకొడుకుల్. 21

వ. అంత నబ్బాలకునకు విష్ణువర్ధనుం డత్యంతామోదమనస్కుండై, విధ్యుక్తకర్మములు నిర్వర్తించి, సకలజనామోదంబుగా పుత్రోత్సవాదుల నొనర్చి, భూసురోత్తంసుల కత్యంతభూరిదక్షిణాదుల నొసంగి, చేతోమోదంబున జయవర్ధనుం డను నామం బిడి, కాలానుగుణ్యంబు లగు తత్కృతశైశవచేష్టల కానందించుచు క్రమప్రకారంబున సుగుణాగ్రగణ్యుం డైన యాచిఱుతనికి విద్యారంభంబుం జేసి. 22

చ. క్రమముగ తండ్రి యాతనికి కాలము మించక చెప్పుచుండగ
న్నమకముతోడ బాలుడును తత్త్వముల గ్రహియించుచుండె శా
స్త్రములను గొంత వేదమును సర్వములైన విదేశభాషల
న్ప్రమదము గొల్ప నిర్వదవవత్సరమేగకె యబ్బె వానికిన్ 23.

ఉ. జ్యోతిషగానవిద్యల నజస్రము మానక వల్లె వేసి యా
పాతమహాప్రభావుడయి వర్ధిల జొచ్చెడి కాలమందు సం

భూతనవీనయౌవనవిభూషణుడై దనరారఁ జొచ్చె న
బ్జాతముఖీజనంబు కుసుమబాణుని బారికి లోఁగి వేగఁగన్. 24.

ఉ. ఆతని మోము గన్గొనుచు నాత్మల మెచ్చని వారు, మెచ్చి ప్రే
క్షితమనోభవాస్త్రముల చేరిక నందని వారు, చేరియున్
చేతమునందు సిగ్గున గృశింపనివారు, తపింప నట్టివా
రాతని నప్పురిన్ గనఁగరారల యంచజయానలందునన్. 25.

వ. అట్టియెడ నాతని పితరులు వైవాహికక్రియ నిర్వర్తింపవెంచుమనం
తలో ననేకసంబంధంబులు వచ్చి తొందర జేయుచుండ నొక్కనా
డా జయవర్ధనుండు దనలో నిట్లని దలంచె. 26.

కం. పెండిలి యిప్పుడు నాకున్
గండంబుగ దోచుచుండె గారామునకో,
దండమునకొ మానరు గుది
బండ మెడకు తగులగట్ట మాతాపితరుల్. 27.

కం. అది జరిగిన నాకింకను
కదలగ నెట కేని వశమె? కావున నిప్పుడే
యదనుగడ దేశ మెల్లను
ముదమున చరియించి చిత్రముల గనుగొనగన్. 28.

వ. అనుచు చింతించి దేశసంచారకుతూహలాయత్తమానసుండై యేరి
కిం దెలుపకుండగ నాటిరాత్రియె పయనం బాయత్తపరచుకొని
భుజించి పవమానసమానయానం బగు గుఱ్ఱంబు నెక్కి యెందేనిం
బోయె. 29.

ఉ. చూచుచు పర్వతావళుల జూచుచు బెక్కునదీనదంబులన్
జూచుచు పట్టణంబులను సొంపగు గ్రామసమూహసంపదల్
జూచుచు చిత్రచిత్రముల జుట్టు మహాటవి యొప్పుచుండగన్
జూచెను మధ్యభాగమున జూతవనం బొకదాని బోవుచున్. 30.

మ. అచట న్నారిలుచుండె నొక్క చెరువం దందు న్విలాసంబుగా
వచనంబు ల్వాసి జెప్పుచున్ సతులకు న్వాక్యార్థము దెల్పుచున్
ఖచరంబు ల్కడు ముద్దులొల్కుటనో! యాఖద్యోతు డత్యంతము
న్విచలుండై గనుచుంట గాంచి జలజంబే నవ్వె దానంతలోన్ 31.

చ. కనుగొని బ్రాహ్మణుం డచట కంజహితు న్విహగంబుల న్తగా
కనుతజలంబు డంబు నధికంబుగ మోదమునందు చాత్ర్మలో
నవితరసాధ్యమై కడురయంబున బర్విడి బోవుచున్న వా
హనమును నిల్పి డిగ్గి వినయంబున సూర్యునిజూచి మ్రొక్కుచున్ 32.

వ. వచ్చి యాతటాకతటనిర్మితసోపానక్రమంబును, తత్రత్యచూతవిటప
చ్ఛాయలును, తత్తటవినిర్మితనానామణిగణఖచితవేదికాంతరంబు
లును కనుగొని యాశ్చర్యావిష్టమనస్కుండై యింత దుర్గమారణ్య
మధ్యమున కీశృంగారచేష్టార్హసరోవరం బెట్లు గల్గెనో యని
యూహించి భీతావహుండై ముందున కడుగిడి తటాకమధ్యభాగం
బున చిట్టిచిట్టియలలచే నిట్టట్టుల కదలింపంబడుజలజంబులును, తన్మృ
ణాళంబుల చంచుపుటంబుల పటపట మనిపించుచు నటనట సంచ
రించు రాజహంసంబులును, రాజహంసముఖోద్భూతమృదుమధుర
శబ్దంబులును, మృదుమధురరవసందర్భవికసితచంచుచ్యుతబిసకిసల
యసముదాయంబులును కనుంగొని యింతింతనరాని సంతసంబున
దంతధావనాదికం బొనరించి శతసత్రంబుల గోయుచు రాజహం

సంబులం బట్టుచు కొంతవడి జలక్రీడందనిసి కూలంబు జేరి వలువల ధరియించి యార్ద్రవసనంబుల దడియారనారవైచి పథిశ్రమవాయ నొండొకచో విశ్రమించె నిది యిట్లుండ. 33.

కం. అయ్యాది చోరుల వాసం
బయ్యెడ వారెట్టి క్రూర మగు పను లైనన్
చయ్యన నిర్వర్తింతురు
కుయ్యెడ విడిపోరు రాతిగుండియ లగుటన్. 34.

కం. చెరబట్టుదు రయ్యెడ కుల
సరసిజలోచనల దెచ్చి సంబరపడుచున్
విరివిగ బాటల గొట్టుదు
రరువది మెళ్లుండు నెట్టు లరసిన పురముల్ 35.

తే. గీ. అట్టి విపినాంతరంబున హాయి మేను
మరచి నిద్రించుచున్న బ్రాహ్మణుడు రాత్రి
పదియు నొకటైన మానడు నిదురవోవ
గలదె? నిద్రకు సుఖము నాకటికి రుచియు. 36.

ఉ. అంతట కొంతసేపటి కమాంతము మూర్ఖులు తస్కరుల్ రసా
లాంతరభాగమందున హయంబుల డిగ్గి పరిక్రమించి యా
ప్రాంతమునందు పండుకొని బాధసుషుప్తిని గొన్నవాని నం
తంతన జూచి యచ్చెరువు నందియు దోడన వారు క్రుద్ధులై. 37.

కం. ఎవ్వడ వోరీ నీ విటు
సవ్వడి లేకుండ వచ్చి శయనించితివా!

ఇవ్విపినంబునఁ గలమ
మ్మెవ్విధినో రూపు మాప నెంచితివటరా! 38.

తే. గీ. అనుచు భాషించుచును లేచి యుండ నప్పుడు
జయుని చుట్టును జేర ఖడ్గయుతులైన
చోరులను గాంచి భయ మంది శూన్యహృదయు
డగుచు నంత కొంతకు తెల్వి నంది మదిని. 39.

కం. నియమము నెరవేర్చెడి యో
నయకోవిదులార! గొనుడు నాదు నమస్సుల్
దయ నిర్హేతుకముగ నా
పయి బరపగ దలప నెట్లు వలదని యందున్. 40.

ఉ. ఏ నది కోరియే యిచటి కిట్టుల వచ్చితి నింతకంటె నా
మానసమందు కోర్కె యొకమాత్రము లే దని నమ్ముడీ ననున్
మానక చంపివేయు డిక నామకకష్టము లుండవం చనన్
మేనులు ఝల్లుమం చనియె మించిన జాలిని తస్కరాళికిన్. 41.

వ. అట్లు జాలి గని తస్కరు లెత్తిన విచ్చుకత్తుల దించి ఏమినాయనా! నీ వెవ్వడివాడవు? ఏల యిట్లు వచ్చితివి? నీ కష్టంబు లెట్టివి? నీకీ విరక్తి యెట్లుగ జనించె? నిన్ను నిర్హేతుకముగ జంపెడి రాక్షసులము గాము. నీదు వృత్తాంతము సవిస్తరంబుగ వాక్రువ్వుమనుడు—జయవర్ధనుండును సమయోచితంబుగ వారికి కరుణ కల్గునట్లుగ తన వృత్తాంబు గల్పించి జెప్ప, చోరులు వాస్తవ మని నమ్మి యాతని చేత దమ యునికి నొరులకు జెప్పకుండునట్లు ప్రమాణంబు చేయించుకొని, వానివద్ద నున్న వసువస్త్రాదికంబుల లాగికొని, జీర్ణవస్త్రంబుల ధరియింప నిచ్చి, కన్నులకు గంతలం గట్టి, గుజ్జంబుపయిం

గూర్చుండఁబెట్టుకొని, ఒక గంటయైనను గాకుండఁగ నావికినబహిః
ప్రదేశమున దించి, యథేచ్ఛం జనిరి. 42.

కం. జయవర్ధను డాదాపున
నయనాలను గోచరింప నగర మ్రొక్కట్టుల్
పయనించి పోయి యట నొక
హయశాల యరుంగుపయి రవంత యొరుగఁగన్. 43.

తే. గీ. కకరంబం బని యాపురి ఖ్యాతి కెక్కు-
నార్కయధ్వజు డంచు నఖ్యార్తిఁ జెందు
పరమధర్మంబు నేతయై బరగు దాని
కతని కైకకపుత్రిక యలరు నొకతె. 44

కం. హేమారుణ యను నామం
బాముద్దులబాల కొప్పు నన్వర్థంబై
హేమమ్ము వంక లెన్నుచు
హేమించెడి తనువు గల్గి హెచ్చై యుండన్. 45.

ఉ. మందురచెంతనే వెలయు మందిర మొండొక టింపుమీరి పౌ
రందరనందనాంఘ్రియుగరాగనిశాంతము వై జయంతమున్
క్రిం దొనరింపజాలు రుచిఁ దగు తావయి మున్ను పుత్రికై
కందళితాంతరంగుఁ డయి కంకణనేత రచింపజేయఁగన్. 46.

ఉ. అంతట ప్రాంతసౌధశిఖరాంతవిలంబితరజ్జు వ్రాని సీ
మంతిని యోర్చు భూస్థలికి మౌనముతో డిగి వచ్చుచుండ నా
వింతను జూచుచు న్జయుఁడు విభ్రమమందుచు నుండ నంతలో
నింతియు జేరవచ్చి నట కేమి యరుంగనియట్లు లాతన్నన్. 47.

వ. గాఢనిద్రాపరవశునివలె నటియించుచుండు నంతలోన నయ్యబ్జ వదనయు,

కం. చేతను వీపున దట్టుచు
నేతెమ్మిక లెమ్ము! లెమ్ము! యింక నటంచున్
భీతిని మెల్లగ బల్కుచు
నాతతజవమైన యొక్క యశ్వము జూపెన్. 49.

తే. గీ. చూపి యద్దాని సరిపోల నోపు నొక్క
హయము నెక్కి లతాంగి ముం దరుగజొచ్చె
ఏమి యిది యేమి యంచు నొకించుకైన
పృచ్ఛ జేయక దానెక్కె విప్రవరుఁడు. 50.

కం. ఆకాంత యాద్విజన్ముం
డేకరణిని యున్నవారో! యెవ్వరో! వీరం
చాకలనము జేయుట యన
చేకూరనియట్లులుండె జీకట్లపుడున్. 51.

తే. గీ. ఎక్కి యట్లుగ కొంతదవ్వేగ నపుడు
జయుని మనమున కెంతొ సందియము వొడమి
మెల్లగా నేదొ పలుకబో, పల్లవోష్ఠి
యనియె నాతని పల్కున కడ్డు సొచ్చి. 52.

తే. గీ. త్రోవలోపల భాషింప తొం దరేమి?
లోకు లన్న నెరుంగవే కాకు లనుచు
లేనిపోనివి కల్పింతురు హాని కల్గు
నందుచే మల్లెవిరితోట కరుగవలసె. 53.

వ. అచ్చట చెలికత్తెల నిద్దుర నుంచియుంటిని కావున కొంచె మాలస్య ముగ నే నింటి కేతెంచినను జలక్రీడార్థ మరిగితి నని లోకులును, తలిదండ్రులును భావింతురని యిట్టి సాంకేతికస్థలం బేర్పరచితి నని నెమ్మదిగ నా సారసగంధి పల్కుటయును, 54.

తే. పాప మీ బాల యెవరినో వలచి, పిలిచి
నన్ను వానిగ భావించె నంచు వేచు
ఎంత కుందునో సత్యమ్ము నెరిగి పిదప
దైవగతి యెట్టులుండునో తలపదరమె? 55.

ఆ. చిత్ర మగును నాచరిత్రమ్ము దలపగ
చచ్చి బ్రతికినాడ మ్రుచ్చులకును
జిక్కి దైవ మేమి చేయంగ నున్నదో
యని విచారమగ్నుడై యతండు. 56.

వ. కొంత దూరం బరుగునంతలో వెంబడి పరువెత్తుకొని వచ్చుగుఱ్ఱం బుల పదధ్వనులు వీనులం బడుటయు నాలకించి, యాయతివమిన్న గుండియ లవియ, మన వెన్నంటి వచ్చెడి గుఱ్ఱపుదళము పాటచ్చరులని దోచెడిని, పట్టుపడుదుమేని ప్రాణహాని యగుననుచు దన వారువంబు నత్యంతవేగంబునం బర్వెత్తించుటయు, నా జయవర్ధనుండును తత్ప్రకారంబు ననుపసరింప, వెన్నాడు రౌతులు వీరి జాడల దూరాన నుండి గన్పట్టి తమ వాహనంబులకుం బని కల్పించుటయు, వీరిరువురును కర్తవ్యతామూఢులై వారువంబులు గొంపోయినకైవడి వాయువేగంబునం బారజొచ్చిరి. చోరులును తెల తెలవారువరకును వీరల వెంబడించియును ప్రయోజనంబుం గానక యథేచ్ఛం జనిరి. 57.

ఉ. అంతట మానినీమణియు నమ్మయ! దాటితి మంచు బల్కఁ బా
ర్శ్వాంతర మందు నున్న జయవర్ధను గన్గొని యమ్మహా! యటం
చెంతయొ నార్చి నేలబడ, నేమియు దోచక బ్రాహ్మణుండు నా
పొంతనె యున్న నీరముల బోసెను దోసిట దెచ్చి మోముపైఁ

ఉ. పోయుచు నామె నెమ్మొగము పోడిమి గన్గొని వాడియైన యా
కాయజు బాణఘాతముల గంటువడఁ మనమొల్ల నా జయుం
డాయపురూపమా సొగసు నారసి నీరయిపో గరంగుచుఁ
హాయిగ మాని బ్రహ్మ మటు లాత్మ దలంచెను నిశ్చలాత్ముడై. 59

చ. జడ యని కేశపాశ మని జారులు కొందరు చంచరీకపుం
నిడుదగుపంక్తి యం చనగ నేర్తురు నే ననుకొందు దీనిని
న్వడివడిగా విధుంతుదుడు పూర్ణచంద్రుని బింబమంచు నీ
పడతుక నెమ్మొగంబు గని వచ్చి నిలంబడె నంచు వెన్కగన్. 60.

ఉ. అబ్జము దీని మో మనెదమా! యది చంద్రుని కోడి వాడు; నా
యబ్జడె కల్వచాన విరహంబున కోర్వఁగజాల కుర్విపై
కబ్జదళాయతాక్షిరుచిరాననమై చనుదెంచె నాదమా
కుబ్జత కృష్ణపక్షమున గుందుచు డిందడె యుల్లసల్లనన్. 61.

చ. ఇల సుషమాసము ల్సుకవు లేర్పడ బల్కిన వెల్లవస్తువుల్
లలితము లౌచు నచ్చుపడరావని నాహృదయంబు జెప్పటన్
మలగియు నేమిచేయుటకు మామకబుద్ధి స్ఫురింపకన్యమ
క్కలువ యొకండె యుక్కలికి కన్నులకీడని యెట్లొ యెంచెదన్. 62.

ఉ. నాసికతోడ బోలుటకు నర్మిలి జేసి తపించి తొల్త నం
దాసను పీకి యూతిలలతాంతము సిగ్గును గాంచి యంత నా

శ్వాసము సంది "ఊరితుద" వంచిన శీర్షము నెత్త్రదాయె నా
హా! సరివారిలో నలతిరైన మనువారికి నిట్టు లౌ గదా. 63.

ఉ. పల్లవతుల్యమైన చెలి పాటలమౌ నధరంబు కాంతులన్
దెల్లని దంతపంక్తి రుచి ధీరత దొ్రక్కి నటించుచుండగా
జెల్లును విద్రుమంబున ఖచించిన ముత్తెపుజాలనంగ; సం
ఫుల్లసరోజనేత్రి స్మితముల్ బొనరించెడి భాగ్య మబ్బునే. 64.

వ. అని కొంతవడికి తెల్విం గని మనమున నిట్లని తలంచె. 65.

తే. గీ. ఏమేమో యిటులను పర
భామామణి గాంచి దురితపంకమునందున్
మామకచిత్తము దిగవడె
నేమందు జితేంద్రియత్వ మేటం గలసెన్. 66.

కం. పరకాంతల దల్లులవలె
పరధనముల లోష్ఠములుగ బరసుఖదుఃఖ
స్ఫురణములు నావిగా మది
నరసెడి నేనేల యిట్టులైతినో! యకటా! 67.

శా. ఏమోగాని మదీయమానసము తత్స్వేలగ్నమై భగ్నమై
నీమంబు న్విడనాడుచున్నయది; దీనింబట్టి జూడంగ నీ
భామారత్న మనన్య యంచనుచు సంభావింతు హృద్వృత్తి యే
పామార్ణ్యంబు వహించు సందియము సంచ్ఛిన్నంప [illegible].

వ. అని తలంచి పట్టరాని తమకమ్మున గ్రమ్మర. 69.

ఉ. బొడ్డనబావిగా పొలతి బొడ్డును భావనజేసి చీమ లా
యొడ్డున జేరగా దలచి యొయ్యన దీనబారుగా తలం
పొడ్డకుమో మనంబ! యిది యుగ్మలి కొప్పెడి నారుసోరుజు
మ్మెడ్డియనా? కనం జనును మేన్నకు నీవగు బుద్ధిజాతికిన్. 70.

ఉ. బంగరుబొంగరాల పరిపాటి చనుంగవ తోసివేయుచో
నంగన సైకతోరుకటి యాగక నింగికి నెంటుచుండ నా
సంగరమందున న్నిలువజాలక మధ్యము మాయ మయ్యె నీ
యంగన కంచు నెంచెద మహాత్మ దలిర్పగ చింత జేయుచున్. 71.

ఉ. రంభ సృజించి దా నొకడె లాక్షణికుం డని మించి గర్వసం
రంభము బూనియున్న యజు రాజసబుద్ధిని దూలజేయగా
శంభుని వైరి యీతరుణి జక్కగ దా రచియించె లేనిచో
సంభవ మౌనె యూరులు పసందుగ నిందుముఖిలలామకున్. 72.

తే. గీ. చంద్రు ఘాటికి నోర్వంగ శక్తి లేక
కోకనదములు యోజించి కూడి మాడి
చంద్రముఖి మోము నిజముగా చంద్రు డనుచు
వలచి పదరూపమై కొల్వ వచ్చెనేమొ. 73.

వ. ఇట్లుగ నాపృథివీసురుండు మదనవేదనాదోధూయమానమానసుం డై యుండ నంతలో నక్కాంత తెల్విం గని, దురంతచింతాకలితస్వాంతయై, మలినీకృతసర్వాంగుండును, పేశుణాసహ్యావసనధారుండునునై, నిగురుగప్పిన నిప్పుచందంబున నొప్పు నప్పుడమిదేవుం గనుంగొని, యేవము నంది, వాని యాననము నాలోకింపక పలుకక నొల్లక నల్లన దురపిల్లుచు, నాపల్లవపాణి మావల్లభు దూగిదూరి, కొండొకవడి కిట్లు దలపోసె.

ఉ. నాకును మంత్రిసూనునకు నెమ్మిలి మైత్రి మదేల? యబ్బె బో
తేకువ నందకుండ యిటు దెప్పరమౌ మతి వానికేల? నే
వ్యాకుల మందనేల? యిటు లంతిపురి న్విడి వచ్చుటేల? నీ
ప్రాకృతు జేరనేల? యిది ప్రాక్తనపాపఫలంబె గానిచోఁ. 75

ఉ. ఇంటికి బోదునా; జనులు నెంతయు వింతగ నాడిపోదురే
మంటకు నోపమి న్పితరు లాత్మలయందున నీచభావముం
గెంటనె గాంతు రంచనుచు వేరుగ పెక్కుగ నేల? యంచు దా
కంటికి మంటికిం గలియుకైవడి నేడ్చె లతాంగి చెంగటన్. 76.

శా. ఏయేపాపములన్ పురాజననమం దేజేసినానో కదా
నాయీదుఃఖల మంతయుం గుడువకుండన్ తీరు జెల్లా నొకో
నాయంభోజభవుండు గాని తరమే; యాపాతనానాభవ
వ్యాయామంబుల నైన పాపసుకృతప్రాబల్యముల్ పొందకన్. 77.

కం. పుట్టిన వెల్లను గిట్టును
గిట్టిన ప్రాణులును మరల గిటకొని యిలలో
పుట్టక మానునె! యిక నే
పట్టున గిట్టంగ దలప ఫల మే మందున్. 78.

తే. గీ. బ్రతికి యుండిన శుభముల బడయవచ్చు
ననెడి నార్యుల వాక్కు లనాదృతములె?
ఆత్మహత్యను జేకొన నఘముకాదె
యనుచు చింతించి యొట్టకే నతివమిన్న. 79.

కం. మునుఁడిన తేల్చిన ప్రాజ్ఞని
సంచితమే హేతు వౌట జనియెద నదియే

గించిన గతి; జెడివచ్చిన
ధరించుకొనఁగలేనె! గళము త్రోక్కో ధృతిఁగో. 80.

వ. అనుచు చింతించి నిశ్చయముఖంబున నామె యుండ బ్రాహ్మణుం
డనుపరిసరంబులం దిరిగి దంతకాష్ఠంబుల కొన్నిఫలంబుల సేకరించు
కొని వచ్చి, కొన్నిటి నామెయెదుటం బెట్ట నామెయు వాని నుపయోగ
పరచి యుత్తరకర్తవ్యం బేమి? యని యడుగుదానివోలెనిలువఁబడు
టయు నామదవతిం బల్కరించుట యనుచితమని నిర్ణయించుకొనిన
యాజయవర్ధనుండు సమాధానంబుపగిది హయంబు నధిరోహించె.
అంతట నామెయు తదనుసారిణి యాయె నట్లు బోవం బోవ. 81.

తే. గీ. ఉభయతటముల నోరయుచు నొప్పి లీల
సుడుల బాఱుచు నొయ్యారినడక లలర
భర్త గూడెడి తమకాన బఱగు నొక్క
దానదిని వారు గాంచిరి దారి నడుమ. 82.

చ. కనుగొని సంతసించి నదికై కరము ల్మొకిళించి మ్రొక్కి రే
వును దరిజేరి నావపయి పూర్వసువాసిని యోర్తు నావికుఁ
పనిగొని మాటిమాటికిని ప్రార్థనఁజేయుచు నుండ నావికుం
డనుశయ ముందకుండ నను నాఘుసలమ్ముకు నిట్లు గ్రిమ్మరఁ. 83.

ఉ. నావను దాటవచ్చెడి జనంబుల ద్వావృజు త్రైక బీదల
స్వేవుర గాంతు వార లొక పీస మొసంగకె యెట్లు పుచ్చెదర్
జీవిక కేవు నీనియెడ జెచ్చెర డిగ్గు మటంచు బల్కగా
నావెడగుంబడంతి ముఖి మక్కట వెల్వెలబాఱ నూర్చెదెన్. 84.

ఉ. ఆవిషయంబు నంతయు సమగ్రముగా పరికించుచున్న యా
భూవిబుధుండు సిగ్గువడి ము న్ననుభూతముగాని కష్టమే
నేవిధిదాటువాడ మది యీసతి తా బతిమాలుచుండగా
"కావుత" మంచొడంబడనిగండడను మప్మోటు సేయునోకదా. 85.

తే. గీ. ముసలి జూచిన నామది మసలు జాలి
యేమి జేయును నిర్ధనుం డెంచ జగతి
నగలు వసనాలు దక్క యీముసువద్ద
నాణె మొండైన గల్గు చందాన లేదు. 86.

ఉ. ఏమి తలంచి యిట్లు పరమేశుఁడు మమ్ముల సంఘటించెనో
యేమి ప్రమాదము ల్జరుగ నేర్పడియున్నవొ? యీమె యెవ్వరో
యేమికతాన నిల్లు త్యజియించి తనంత తెగించి వచ్చెనో
కామిని చేలచెంగునను గట్టిన యగ్నికణం బగునేమొ నాకికన్. 87.

మ. అని భూమీసురు డాత్మ నెంచుతటి నయ్యంభోజపత్రాక్షియున్
మనమం దేమి దలంచెనో యెఱుగ హేమంబైన హారంబునం

దనుమానింపక కొంత దేవించియుడ నయ్యార్యపుత్రుం డా
జని దానిం గొని యేగి నావికునితో సౌమ్యంబుగా నిట్లనుఁ. 88.

తే. గీ. ఓయి! నావను శీఘ్రముగా నీయవలయు
నల్పధనమున కిత్తు నీహాటకంబు
వృద్ధభామిని! మమ్ము దరింపజేయు
మయ్య' యియ్యేటి గురుఁడు భవాబ్ధి కోలె. 89.

వ. అనుటయు,

కం. జయవర్ధను గీర్తింపుచు
నయమున దోడ్కొని బూనె నావికు డంతన్
పయనింపసాగె నవ్వాయు
నయుతంబుల నతులు నుతులు నర్పణ లిడుచున్. 91.

ఉ. అవ్వలి యొడ్డు జేరిన యనంతర మందను నావ డిగ్గి పో
నవ్వ క్రమంబునన్ జయుని యంతికసీమను జేరి పల్కె న్నే
నెవ్వలన న్మరొండు గతి యేర్పడ నట్టి యనాథ మొక్కెదన్
బువ్వయు పుట్ట మిచ్చి నను బ్రోచిన నిచ్చలు నంచి పెట్టెదన్.92.

తే. గీ. అనుచు బతిమాల నట్టులె రమ్మనుచు నతడు
దైవ మేమేమి జేయఁగ దలచినాఁడొ
అని విచారమగ్నుఁ డగుచు నడుగ జొచ్చె
"హేల" యను మెడి పట్టణం బేగు తోవ. 93.

వ. అంతట నానాయంకాలంబున కా మువ్వురునుం బోయి, హేలా
పురిం జేరి, యం దొక సత్రముం బ్రవేశించి, నాటిరాత్రి కట భు
జించి, శయనించి రంత మరునాడు. 94.

తే. గీ. కోడి కూయంగనే మేలుకొంచు జయుఁడు
కాల్యకృత్యంబులను దీర్చి గడఁగి స్నాన
మాడి నొసట విభూతి పొల్పార దీర్చి,
పీటివణిజుల వీక్షింప వెడలె నంత. 95.

కం. పంచాంగము గొని విపణికి
సంచితగతి నేగి వణిజు లాలింప నరేఁ
మంచిదొ కాదో గ్రహముల
సంచార మెఱింగి తెలుపజాలుదు మీరుఁ. 96

కం. వచ్చినచో మీజాతక
మిచ్చిన ఫలములను వ్రాసి యిచ్చెద నిజమై
వచ్చెర జరిగిన పైమీ
యిచ్చియు నాప్రాప్తి దనరు నే ముందు నికఁ. 97.

తే. గీ. మాది గోదావరీతీరమందు నొక్క-
పల్లె దీర్థయాత్రల జేయపయన మైతి
మంత త్రోవలో దొంగలు కొంతమంది
ముల్లెలెల్లను మావద్ద కొల్లగొనిరి. 98.

వ. మేము మువ్వుర ముంటిమి. యీరోజున కేగు భోజనపదార్థంబుల
నిప్పించిన జాలునని సయుక్తికంబుగ జెప్ప నవ్వణిగ్వరులు నట్లయని
యనుమతించిరి. 99.

ఉ. ఆతఁడు వ్రాయు వ్రాతలు యథార్థములై దనరారఁ జూచి నా
రాతతమోద మంది వినయంబున బిల్చుచు మాకు నిచ్చలుఁ

జాతకము ల్విచారణ మొనర్చి ఫలంబులు వ్రాసియిచ్చినన్
పాతికరూకల న్నియతి మావక యిత్తుము మాసమాసమున్. 100.

క. అని చెప్పిన జయవర్ధను
డనుమోదము నంది తాటియాకుల యిల్లున్
గొని యద్దెకు నట జేరెను
వనజాస్యయు మానదాయె వనటం జెందన్. 101.

కం. హేమారుణజయవర్ధను
లేమా! మాట్లాడ కెందు కిట్లుందురో! భా
ర్యామణియును భర్తయు గా
రేమో? యని మురలి యెంచ రెన్నఁడు మదిలోన్. 102.

తే. గీ. జరుగుచుండగ నిట్లు ప్రస్తావనమున
నొక్కరోజున వర్తకుం డొక్క డనియె
రత్నవర్తక మందు దలంపు గలదు
రత్నపరిశీలకుఁడు గావలయు నటన్న. 103.

తే. గీ. దాన నాకు నొకించుక పరిచ
యం బటంచు జయుం డన నల్లె యైన
సింక మాకేమి కానలె? నేల పరుఁడు
విూ కె యిచ్చెద మేబదిరూక లెలమి. 104.

ప్రథమాశ్వాసము
సమాప్తము.



# జయవర్ధనుడు.

## ద్వితీయాశ్వాసము.



ఉ. ఆపురి రామకాంతు డను నట్టి నృపాలకు డేలుచుండె: వా
డేపడతిన్ గనుంగొనిన నేమరకుండగ నాటిరాత్రి యే
పాపవిభీతిలేక తన పాన్పున జేరిచి కూడు; దానికిన్
కాపుర మూడినన్ సరె; జగంబు తనున్ శపియించినన్: స

క. మంత్రియు నృపతికి ననుగుణ
తంత్రవిదుం డగుచు నిష్ఠతను బేర్పడి తా
మంత్రణము మాని యబలల
జంత్రముల పగిది దెచ్చి సమకూర్చు సదా.

తే. గీ. ప్రజల నష్టాక వెట్టెడి వారి గాంచి
యెవ్వ రేమనగల? రన్న నెవడు వినును
కంచెయే చేను మేసిన కా పటంచు
పల్కు–వా రుందు రే యన్నపగిది నుండె.

ఉ. రాజ్య మరాచకం బగు తెఱంగున నుండెను ధర్మకార్యము
పూజ్యము లయ్యె మన్మథుని పూజ లనంతము లయ్యె కాం
భోజ్యము లైనవస్తువుల బోలుదు రంచు ప్రచార మేర్పడెన్
వ్యాజ్యము లెక్కు–వాయె నిక ద్వ్యాజ్యములాయెను వేదశాస్త్ర

వ. ఇట్టి పరిస్థితిలో.

ఉ. వర్తకు డొక్క డాపురికి వజ్రము నొక్కటి నమ్మ దెచ్చి భూ
భర్తకు జూపి దాని వెల పాతిక లక్ష లటంచు జెప్పి త
ద్ధర్తకు గల్గు గౌరవ మెద న్గ్రహియించి తదీయమూల్యమున్
బూర్తిగ నెంచి చెప్పు డనె బోషితరత్నపరీక్షకాళితోన్. 6.

వ. వారలును తదీయరామణీయకముం గాంచి, వివిధంబులుగ వెలలం జెప్ప నసంతృప్తుండై సచివున కావజ్రం బిచ్చి, యప్పురింగల రత్నపరీక్షకులకుం జూపి ధరలం దెలిసికొని రమ్మని పంచె. అట్లు పోయి యాయమాత్యవరుండు తత్తత్పరీక్షకులకుం జూపిన. 7.

ఉ. తొమ్మిదిలక్షలీమణికి తోసముతోడుత నీయవచ్చు నా
నమ్మిక యంచు నొక్క డను న్యాయము వింశతిలక్షలీయ నా
నమ్మిక యం చొకం డన గనంగను నిర్వదియైదులక్షలీ
సమ్మత మంచు వేఱొక విచక్షణు డయ్యెడ బల్కె ధీరతన్. 8.

ఉ. చెల్లును దీని కీపిలువ జెప్పగ నంచు నిరూఢిలేకటన్.
తొల్లి విధాన నెవ్వరికి దోచిన రీతిని వారు జెప్ప దా
వల్లె యటంచు బోయి జయవర్ధను చేతికి నీయ నాతడున్
గల్ల నిజంబులం దెలియగా గనుచు న్విఱిచె న్నిజోష్ఠమున్. 9.

తే. గీ. నహావ! యంశంబు వర్ణింప వలనుగాదు,
కాన నీవచ్చు దీనికి గాని యొకటి
అంచు బల్కె నిపుణుండై హాస్యమాడు
చుంటివా? యబ్రమయ్యె నీయుబుసు వినిన. 10.

క. అనువా? పరిహాసం బది
జనపతికార్యంబులందు జడమతి! యోహో

చనుదెమ్ము రాజసభకును
మనియెదె? భూపాలకోపమహిమకు గుఱియై. 11.

వ. అనుచు నమ్మంత్రి జయవర్ధను డెంతజెప్పినను వినకతోడ్కొనియేగి యామూలాగ్రంబున రాజునకు న్నివేదింప నాతఁడు జయవర్ధనుని దిక్కు మొగంబై.

ఉ. ఏమది దారుణంబు కనవేమయ విప్రుఁడ యింతగర్వమా
భూమిపతిత్వ మూని కడు పూజ్యుఁడనై దనరారు నన్ను నీ
వామికనూని యిట్లు పరిహాసము చేసెదె? కాదటందువా
యీమహనీయవజ్రమున కీయసదైన ధరన్ వచింతువే. 13.

వ. అనిన భూవిభు మాటల కడ్డంబై భూవిబుధుం డిట్లనియె. 14.

చ. నిజమగు వజ్రమైనయెడ నిక్కమె యీవెలచేయునంట, యే
కుజనుఁడు చెప్పె మీ కెదియొ కూయఁగ, నేమగునయ్య దీనిలో
నిజమును జూపెదన్ గనుఁడు నే డిదె యంచని దానిలోహపున్
ధ్వజమున గొట్టగా నదియు తక్షణ మారెను వేయి వ్రక్కలై. 15.

తే. గీ. వజ్రమది వజ్రమున నె చీల్పంగబడు న
టన్న లోకోక్తి యెఱుఁగకె యున్నవారె?
నా వచించెడి పలుకు చందమ్ము గనక
కోపపడినను లాభంబె కువలయేశ. 16.

ఉ. వాని వచోనిగుంభముల వాని వినమ్రత వాని శాంతమున్
వాని విశేషనీతియుతభావము వాని పరీక్షదక్షతన్
వేనికి గల్గబోవనుచు బేర్కొనుచుండగ నాసభాసదుల్
వాని నహేతునిందలకు బాల్పడజేసితి నంచు భూపుఁడున్. 17.

క. సిగ్గిలి దా జయవర్ధను
దగ్గరకును బోయి వినయతత్పరమతియై
యె గ్గొనరించితి వాక్కుల
తగ్గుడు కోపంబు నుడిగి ధరణీదేవా. 18.

క. ఒనరించినారు మీరలు
ఘనతర మైనట్టి యిట్టి కార్యము నాకై
యనుచును తోడ్కొని తగు నా
సనమున గూర్చుండ జేసి సాదరబుద్ధిన్. 19.

తే. గీ. నేఁడు మొదలుగ మీరలు నియతి నా స
ముఖమునయందె రత్నపరీక్షకు లయి
వరలగోరెద జీతంబు వందరూక
లిత్తు నంగీకృతిని దెల్పుడీ యటన్న. 20.

వ. జయవర్ధనుండు నట్లె యని తత్పదం బధిరోహించె. రాజును జయ
వర్ధనునం దమందాదరుండై యొప్పుచుండ కొంతకాలం బరుగు
నంతలో మంత్రి దురంతవ్యాధిపీడితుండై దివి కరిగిన తత్స్థానం
బందు జయవర్ధనుండు నియుక్తుం డయ్యె. 21.

తే. గీ. ఓడ లగు బండ్లు బం డ్లగు నోడ లోకపు
డమవస చనంగ బూర్ణిమ యరుగుదెంచు
కష్టసుఖములు బండిచక్రములపగిది
నఖిలజీవుల జీవితమందు దిరుగు. 22.

సీ. ఏమూల జూచిన నెంతేన ననర్ఘమౌ
దానధర్మంబులె దనరుచుండు

ఏవంక జనుచున్న నితిహాసపూర్వక
వేదశాస్త్రంబులె వినగనొప్పు
ఏపక్కగనుగొన్న నింపుమీరెడి సత్రి
పాఠశాలావళుల్ ప్రబలుచుండు
ఏదిక్కు చనుచున్న నాదిక్కునను నిర్మ
లాంబుతటాకకూపాది తోచు.
తే. గీ. నుచితవైద్యశాలల లెక్క కొకటి కాదు
పరమసౌభాగ్యభాగ్యసంపన్న మగుచు
వర్ధిలగ జొచ్చె నల్ల జయవర్ధనుండు
సచివుడైన కాలంబున నచిరగతిని. 23.

తే. గీ. జయుని సన్నుతి జేయని జనులు లేరు
ప్రబల మగు ప్రేమ బొందని ప్రజలు లేరు
వాని నుడి గట్టువడనట్టివాడు లేడు
విభుడు మారాజ లేడింక వేయు నేల. 24.

క. ఎన్నండును హేమారుణ
గన్నెత్తి కనండు తన యగారమునందే
యున్నను కన్నెయు చూచుట
సున్నసుమీ వన్నెకాని సొంపౌ కయపుదుర్గ. 25.

క. హేమారుణ కేలోపము
నామంబున కేని లేదు నాకీమణి దా
నేమాత్రము భోగంబుల
కామింపద యట్టులుండ గాంచె ముదమ్మా. 26.

కుందుచునుండు సదా గో
విందుని నెమ్మదిని నిలిపి వీడక జపముఁ
బొందుగ జేయును జయునకు
నెందే నుపకారములను నెంచును జేయఁ. 27.

ఈమె యిట్టుల జయవర్ధనుండు జూపు నాదరాతిశయంబులకు సంతోషాశ్చర్యవిషాదంబుల నందుచు నొకవిధిని కాలంబుఁ వెళ్ళబుచ్చుచుండె. జయవర్ధనుండును హేమాంగనాప్రసక్తి గాని, తదీయ దర్శనంబు గాని స క్తంబగునెడ మన్మథవ్యథావ్యథితమానసుండై. 28.

వీణానాదాలాపిని
యేణాంకమృగాయతాక్షి నిందిందిరస
ద్వేణిఁ మృదుతరపల్లవ
పాణిఁ సుశ్రోణి దీని బాయుఁ దరమె. 29.

గీ. అని విమోహితు డయ్యును యంతలోన
తెల్వి గనుగొని తనయందు తీపి లేని
యన్యసతి బల్మి మై గవయంగ నెంచు
టదియు నిహపరంబులకు సన్యాప మిచ్చు. 30.

అని మతిమరల్చుకొనుచుండు నివి యిట్లుండ. 31.

గీ. రజకి యొక్కతె నిత్యంబు రాజగేహ
మంత్రిగేహములయందు నంబరము లుదుకు
నంత నొకనాడు మంత్రిగృహంబునందు
వస్త్రముల గొంచు రాజన్య వసతి కరుగ 32.

తే. గీ. తమ గృహాననకు వచ్చెడి తరుణమందు
రజకిచెంగట వసనాల రాజపత్ని
గనుచు ప్రశ్నించె నేరి వి వ్వనుచు నదియు
నమ్మ! యిది మంత్రిగారి వస్త్రమ్ము లనిన. 33

ఉ. ప్రాయ మదెంత? మంత్రిజయవర్ధను భార్యకు పిల్ల లెందరో
ప్రాయగ మెంతపాటిదియొ సొంపగు కాంతలు విప్రులందు నే
చాయను గల్గరంచు పలుసారులు వింటినటన్న భూమిభృ
త్తోయజనేత్రితో రజకుతొయ్యలి యొయ్యన బల్కె నీక్రియన్. 34

ఉ. పిల్లలు లేరు ప్రాయమున పిన్నది చక్కదనంబు జెప్ప నా
వల్లనగాదు గాని యొక పల్కును జెప్పెద నాలకింపు డా
ఫుల్లసరోజనేత్రి గను పూరుషు డెట్టి శుకుండుగాని తా
తల్లడ మందు మన్మథుని ధాటికి నాగక జీవితాంతమున్. 35

ఉ. అవనితాశిరోమణికి నందమునన్ సరిపోలు నంగనల్
భావన జేసి చూడ సురపన్నగగారుడసిద్ధసాధ్యులం
దేవగ, గానరారు వచియింపగ నేటికి బెక్కుపల్కు లా
భావిని గాంచ గౌగిళుల బట్టి సుఖింపదలంతు భామ లే. 36

క. వెళ్ళిన దాడిగ మన్మథ
భల్లం బనదగిన యట్టి పడతిని గని నా
యుల్లమున నుల్లముంపదు
పల్లవపాణిరొ! నిజంబె పలికితి జుమ్మీ. 37

తే. గీ. ఇట్లు నోరార వర్ణించి హేమ నదియు
చనెద తడవాయె సెల వీయు డనుచు బలికి

వలువ లన్నియు జేకొని వెలికి నరిగె
ఇట్టితఱి కన్నెలంగి యున్నట్టి నృపుడు. 38.

శా. ఆవాక్యంబుల నెల్ల నాదిసహితం బాలించి భూభర్త సం
భావించె న్మది నెట్లు గాంచినను హేమారూపమే దోపగా
నేవంభూతవధూశిరోమణియ యొందే నున్న వర్జించి నే
జీవింపగలనే క్షణం బయిన నిస్సీ! లోక మే మాశిరన్. 39.

ఉ. అందును మంత్రిభార్యయట యామెను బొందగ నాకు శక్యమే
కుందుచునుండనో తెగువయున్ జొఱబాఱిన ప్రాణముండ దే
మందు ప్రధాని రీతి కటువయ్యెడునే కయి వచ్చి మేనుగా
క్రిందుకొనన్ మదీయరుచి క్రమ్మఱ బూర్వపుమంత్రితోడనే. 40.

ఉ. వందురిలాభవా? రజకభామిని పల్కినరీతి జూడ నా
సుందరియందచందములు నొక్కపుటి క్కని తోచుచుండె నిం
దిందిరవేణి నొక్కపరినేని గనుంగొని నిల్తునం చెదన్
కొందల మందె కాముకుల కోర్కెల కర్థము లుండనేర్చునే. 41.

క. మరునా డుదయము మంత్రిని
కెర మాప్యాయనముతోడ గాంచి కుసువగా
నరుదేరుము మాయింటన్
జిరముగ వాంఛింతు విందు సేయగ నీకున్ 42.

వ. అని యాహ్వానింప రాజయవర్ధనుండు నాటి మధ్యాహ్నంబున
రాజసదనంబున కరిగె నప్పుడు. 43.

ఉ. రాజు ప్రధానియుం గలసి రాణియు వడ్డన జేయుచుండగా
భోజన మారగించు తఱి భూపతిహస్తము నడ్డి "వద్దికన్

మాజయు భార్య రే పెటులు మానక వర్ధన సేయు నిత్యముఁ
భోజన మెక్కు నైనయెడ బొట్టకు బాధగదా సతీమణీ!” 44.

చ. అనుచును నవ్వుమోమున నృపాధము డాతని దిక్కు జూడగా
గని సచివుండు ఝల్లు మనగా నెద నుత్తర మీయలేక భో
జనము విషంబు గాగ నిముసం బట నుండగలేక నెట్లొ భో
జన మొనరించువాసివరుసన్ సహించుచు నెమ్మనంబునన్. 45

శా. దుష్టాచారుడ యెట్టిఘోరమున కీదుర్మార్గమున్ ద్రొక్కితో
స్పష్టం బౌయెడి నీమనోగతము నాసామీప్యమం దున్న యా
కష్టాజీవకు రాకుమారికకునై కల్పించి తీయెత్తు నో
భ్రష్టా! నీతను వేల యాముకొల గాల్పన్ భస్మమై పోవదో. 46.

ఉ. హేమను నాదు భార్య యన యీపుర మెల్లెడ వాదు లుగ్గటచే
కామను సందియున్ గలియుగావని వెన్కకు జంకుచున్న వా
డామెకు నాకు నైన కథ నంతయు జెప్పిన మత్తుడీత డి
చ్చో మరియాదవీడి జెరచున్ గద యేమననౌనో యంచెదన్. 47.

ఉ. కుందుచు నిట్లు నాకొన నకుంఠితపుణ్యవశంబె గాని చో
నెందుల కిట్టిమాట వెడలించెద రిత్తఱి మీరు నోట న
న్నందుల కేని సత్య మగున ట్లొనరింపవలె న్గదయ్య మే
మందరమున్ త్వదీయచరణాశ్రితపక్షము వారమేనియున్. 48.

తే. గీ. భక్తిపూర్వకముగ పిలువం దలంతు
మీరు నాయందు ననురక్తి గూర్తురేని
డొంకతిర్వ్యదు రీతి నుటంకరించి
పిలువ సంప్రీణితాత్ముడై విభుడు బలికె. 49.

తే. గీ. అయ్యో! మాటవరుసకు నేనంటి నింత
మాత్రికే పిల్లవలె నోర్చి యాత్రపడుచు
భుక్తి కేగుట యన నాకు మోదమొదవు
నట్టి వత్తు మీయందలి యాదరమున 50.

క. అను రామకాంతు మాటల
జనియెను జయవర్ధనుండు సంతోషంబుం
గనినట్టు లభినయించుచు
మనసు మనసునందు లేక మల్లడి గొనుచున్. 51.

ఉ. తల్పము జేరి పొర్లుచును తత్కరణీయవిధాన మెట్లుగా
కల్పన సల్పువాడ నని గాఢవిచారనిమగ్నుడౌచు దా
నల్పుని మాడ్కి నుండ నిశియామటయు నయ్యెడ భోజనం బొగిన్
సల్పగ వృద్ధ పిల్వగ వెసన్ బలికెన్ జయవర్ధనుం డిటుల్ 52.

క. ఆకలి లేదు భుజింపను
మీకు వృథాప్రొద్దు పోవు మెసవుండన పీ
డోర్చక ముసలామె తినుమ
నాన్న! కొలదిగ ననుచు బ్రార్థనము చేయుటయున్. 53.

తే. గీ. వినుచు నావాక్యసరణిని విభుని పుత్రి
జయుని కేదియో కష్టంబు సంభవించె
ననుచు నెంచి చేతనగు కార్యంబె యైన
దాని దీర్ప నెంచెను గాన దాను వచ్చె. 54.

వ. అట్లు వచ్చి కవాటంబు మాటున న్నిలచి యాయవ్వకు చె
ప్పుదానివలె నిట్లు వల్కె. 55.

క. ఇద్ధమతు లైన పురుషుల
కిద్దర సాధ్యంబుగాని దెదియో చెపుమా
వృద్ధవు నీవెఱుగవె యీ
పద్ధతు లిక్కరణి మఱుగ స్థలమా చలమా. 56

క. తేరా! తన భృత్యులు వా
గ్దారా! పని దీర్ప నక్కఱకు రాదగరా
వేరే భావింతురె వా
రౌరా! కృతకృత్యు లెట్టు లగుదురొ జెపుమా. 57.

క. అని వనజానన బల్కఁగ
విని జయవర్ధనుడు మదిని వీతభయుండై
యనె ముదుసలి వడతిం గని
విను మామూలాగ్ర మేను వివరింతు నిటుల్. 58.

ఉ. రాజును నేనునుం గలసి రాణియె వడ్డన చేయుచుండగా
భోజన మారగించుతఱి భూపతి హస్తము నడ్డి "వద్దికల్
మా జయు భార్య రే పెటులు మానక వడ్డన చేయు నిత్యముల్
భోజన మెక్కువైన యెడ బొట్టకు బాధగదా సతీమణీ!" 59.

చ. అని తనభార్యతో బలికి హాస్యయుతంబుగ నన్ను జూచె దు
ర్మనసుడు లోలబుద్ధి యని రాజు నెఱింగియు నస్మదీయగా
ధను వివరింతు నేని గలదా యనుమానము మానభంగముం
దని తలపోయ బాధ హృదయంబు కలంచి హరించి మించెడిన్. 60.

క. పిలువకపోవుద మనుకొన
నలతిగదా పిలువు మంచు నడిగినవానిన్

తలపడి పాకము నీవే
లలితముగ నొనర్తు వన్న రసహీనంబా. 61.

తే. గీ. అనుచు నేమేమొ బలుకబో నంతలోన
నుత్తరం బిచ్చుటకు సమాయత్త యగుచు
అనుగు లోకరెండుమూఁడు ముందిడగ హేమ
కఠినగతమయ్యె జయుని యాస్యంబు తోల్త. 62.

ఉ. చూచినయంతనే జయుని సొంపగు రూపము హేమ మానసం
బేచెడి మారజాలమున నేపుగ లాగెడి నాత్మ కంతలో
పూచిన పుచ్చపూవువలె పొల్పెసలారెడి చంద్రబింబమై
దోచెను వాని యాననము తోయజనేత్రికి యట్టి పట్టునన్. 63.

ఉ. ఆతని సర్వసుందరత కబ్బురపాటును గన్న తత్సతీ
చేతము కళ్ళెముల్ దెగుట స్వేచ్ఛను బర్వెడి యశ్వముం బలెన్
పూతచరిత్రునందు బడిపోయి యెటుల్ మరలంగబోక య
ప్రాతలి రాకుబోడి వశమందున నుండకపోయె నట్టిచోన్. 64.

ఉ. ఎంతటి సోయగం బితని కెంతటి మాధురి వాక్కులందు నిం
కెంతటి శాస్త్రపాండితి యదెంతటి నీతివిశేషభావ మిం
కెంత యుదారతాగుణము మిన్నిటికంటెను సంతతంబు నే
చెంతన యున్న నోర్చుట విచిత్ర మసాధ్యము ధాత కేనియున్. 65.

సీ. దొంగపండును మీరి తుంగగలించెడి మోవి
నొక్కింత గోరిలుట మోక్ష ఫలము
వెడదనై యె కనుపట్టు నీని వక్షంబు బాన
నినవక్షోజముల్ పేనుఫలము

నవమన్మథుని బోలు నవయౌవనుఁడు వీని
తగ గౌఁగిలించుటే తనువు ఫలము
మురిపెంపు గరువంపు ముద్దుగుల్కెడు వీని
చెక్కిళ్ళ ముద్దాడ జీవఫలము
తే. గీ వాని యమృతోపమానమౌ వాక్యములను
విన్నచో నద్దియే వీనులున్న ఫలము
యిట్టి పురుషుని గూడంగ నింతు లెంతొ
పూర్వజని జేయఁగావలె పుణ్యములను. 66.

వ. అనుచు మదనకృతమదోత్కటయై కొంతవడి కామదవతి మంద
స్వరంబున. 67.

తే. గీ. ఇంతమాత్రపుపనికినై చింత యేల
నన్నియుం జక్కపఱచెద నవనినాథు
భోజనమునకు పిలువంగ బోవనచ్చు
లేచిభుజియింపఁజను నన లేచె జయుడు. 68.

ఉ. భీతి నొకింత వాసి పృథివీసురు కన్గొనలేక గన్కఁ బదా
చేతము నందు గోరు ధనచేరిక నుండిన సుందరాంగు నీ
పూతచరిత్రు వీడ దలపోసితినే యని కుందు నింత కా
ర్యాతిని నాత డేలుకొనునా? యని సంశయ మందు నెమ్మదిన్. 69.

చ. మెసవగబోవ భోజనము మిక్కిలి నెక్కసమాయె నొక్కచో
మసలుట భారమాయె యుగమా! యని దోచు నిమేషమాత్రముం
బొసగదు నిద్ర కంటికిని బూత్తిగ పాల్కి నేమి దోసమో
విసముగ దోచె నీరములు వీనుల కెక్కని కేమి జెప్పనన్. 70.

ఉ. చల్లని చేతుల న్నిగుఱుజూపి సమస్తచరాచరంబులన్
మెల్లనదాకి కష్టముల మేన దొలంగగ జేయు రేవతీ
వల్లభు డేమొకో విరహబాధను గొందెడి హేమగాత్రినుల్
భల్లనిభాంశుఘాతములు బాధిలనెట్టు ని దేమిచిత్రమో. 71.

ఉ. అండజయాన నిద్రనుండితఱి నాతని గాంచగ మెల్లమెల్లగా
సుందరి కొంతసేపటికి మాటు జొచ్చి కరంబు వడంక దేహమా
ముందున కేగలేక నిజమూర్ఖత నెంతయు తిట్టుకొంచులో
గుందుచు నేగు దా వెనుకకున్ మఱి ముంగున కంత వెన్కకున్.

వ. ఇట్లు కంతు సంతాపసంతప్త చిత్తయై యుండ. 73.

సీ. ప్రాచీదిశావధూఫాలభాగమునందు
దీపించు సింధూరతిలక మనగ
ఇంద్రాణి మెడలోన సాంద్రమై గనుపట్టు
కాంతు లీను ప్రవాళఖండ మనగ
పూర్వదిగ్దాడిమీభూజంబు బీజసం
పద దోప పండిన పండనంగ
తిమిరంబు గాల్పగ దేవదేవుడు వేయు
పొడవైన నిప్పుల ప్రోవనంగ.
తే. గీ. కాకకులములు జెక్కల్ల గాము మేము
కాకులము రాపు సేయక కావుకావు
మనుచు రొద జేయుచుండ నయ్యంత బొడమె
తోయరుహబంధు డప్పుడు తూర్పుగిరిని. 74.

ఉ. అంబుజమిత్రు డాకసమునం దుదయింపకమున్నె లేచి కా
ల్యంబుల నెల్ల దీర్చికొని హాయిగ స్నానము చేసి యుత్తమా
శ్వంబు బొకదాని నెక్కి నృపు సన్నిధి కేగ మహీంధపుత్రుడు నె
య్యంబున గారవించి యుచితాసనమున్ గనజూపి యిట్లనున్. 75.

తే. గీ. వినత యనియెడునా ప్రతీచి విభు డితండు
వాస మితనిది కేయూరపట్టణంబు
దాని యధిపతి యార్యమయధ్వజుడు వాని
మంత్రి కొమరుండు వీనిని మదను డండ్రు. 76.

వ. అని తన దాపున కూర్చుండి యున్న జామాతం జూపి యన్యోన్య పరిచయం బొనరించిన జయవర్ధనుండు మదనుని గాంచి యాదరం బున నిట్లనియె. 77.

శా. ఏశాస్త్రంబుల నభ్యసించితిరి మీ కేశాస్త్రమం దాదరం
బో శస్తప్రతిభుండ! తెల్పగదె నీ కొప్పారు పాండిత్యమం
చాశంసించిన మంత్రిసూనుడును గానాధీతి నాదంచు మీ
రేశాస్త్రంబుల నభ్యసించితి రటం చేపారి ప్రశ్నింపగన్. 78.

క. మదనున కిట్లను జయుడే
జదివితి వేదంబు జ్యోతిషంబును కొంచెం
బెదియో చదివితి గానము
మొదలగుకళలందు వేద్యముల నెల్లన్. 79.

ఉ. గానమునందె నేనెపుడు గాటపుసాధన జేసియుంటచే
గానను వేఱుశాస్త్రముల గాని, పరిశ్రమ జేసి యుంటచే
గానను మత్సముల్ బరుని గానకళన్ జయ మంచగోరి నే
మానక దేశదేశముల మన్నన లందుచు సంచరింపుదున్. 80.

క. మదనుం డిట్టుగ నెవో
పదనగు గర్వోక్తు లాడ బ్రారంభింపన్
మదిలో జయుడును జింతిలి
తుద కెట్టులొ తెగి వచింపదొడగె నతనితోన్. 81.

తే. గీ. ఒకని మించెడివాఁడు వేఱొక్కఁ డుండు
నంత మెక్కఁడ చదువుల కంచు బలుక
సహజగర్వాంధుఁడైన యాసచివసుతుఁడు
కటకటం బడి యీర్ష్యచే నిటుల పలికె. 82.

తే. గీ. నేను జీవించియుండఁగా గానమందు
నొరులు గెలుచుట యను మాట యోటుమాట
ద్రవిడకర్ణాటు లాదిగా దాక్షిణాత్యు
లెల్లరు నమస్కృతులు జేసి డిల్లవడిరి. 83.

క. నాగొప్ప నేను జెప్పుట
యాగంబని యెంచి యెందుకంచని యుడుగన్
వాగాడంబర మెంతగ
సాగించితివయ్య యిచటి సభ్యులు వినఁగన్. 84.

క. అను వాని మాటలన్నియు
విని జయవర్ధనుఁడు మదిని వింతయు కోపం
బును పొంది వీని నునమిం
తన యణఁపగవలె నంచు దలచి వచించెన్. 85.

ఉ. కాలము గొడ్డువోయెనె! ప్రకాశము నందరె తార లట్టు తే
మూలన నున్నమాత్రమున పోవునె తత్ప్రతిభాప్రభావ మీ
పాళముడానికే నిటుల బల్కఁగవచ్చునె? న్యాయ మౌనె ని
ర్మాలతనందు మీప్రతిభ పూర్వసమంచితమైన దంతయున్. 86.

క. గర్వము సర్వజనంబుల
కర్వము దైవంబు దాని కనుమతి నిడునే

పూర్వ మణంగ దేశ గరుడుడు పే
ఖర్వం బగు గర్వ ముడిగి కమలాపతిచేతన్. 87.

క. అన మదనుడు తల నూచుచు
పని లేదిక మీరు శ్రమను పడకుడు వృథగా
ననునైనన్ రక్షింపుడు
కనియెద నవ్వాని శక్తి కలహమ్మెల్లా. 88.

వ. అను మదను నుడుపుల నాలకించి జయవర్ధనుడను సంవృద్ధ క్రోధుండై యిట్లనియె. 89.

క. చేయింపుడు సభ రేపే
నా మోసపుటంతవట్టు నయమున నేనే
గాయకుడ నగుదు సభకున్
నాయకు సేర్పరచి చెప్పుడు న్యాయము దీర్పన్. 90.

క. గెలిచినవారికి నన్నున్
గెలిచితి రీ రంచు వ్రాసి కేల్మొగిచి సభన్
పలుకగనట మోమోటము
వలదం చన మదను డంత వల్లె యటన్నన్. 91.

తే. గీ. ఒప్పు నాస్థానగాయకుం డొక్కరుండు
పుత్రిని చేతొకట్టి సంగీతబుధుడు నగుచు
వీనినో లేక వానినో గాని పిలువ
బంపెదను మీకు నిష్టమే దంచు రాజు. 92.

తే. గీ. పలుక, పిలిపింపు డెవ రైన పనికివత్తు
రని జయుడు పల్కె నతడు సమయంబు గాన

మా గృహాసనకు వివాహ జామాత గూడి
భోజనార్థము రండంచు భూపు బిలువ. 93.

తే. గీ. వెక్కిచిరునవ్వు మొగమున వెలయ జేసి
ఈదినంబున మాయల్లుఁ డేను గలసి
యింట భుజియింపవలె గాన నేగుదేర
వలను పడ దిప్పు డెప్పుడో వత్తుగాక. 94.

ఆ. వె. అనెడు నృపుని పల్కు లాలించి యీయాజ్ఞయుం
డెంతయేని మదిని సంతసించి
నమ్రిభాన మానసంబున ద్రోణకంగ
బోయిరా ననుజ్ఞ నీయు డంచు. 95.

వ. ఇంటికిం బోయి యవ్వాం జూచి. 96.

తే. గీ. వాని జామాతతాకచే వలనుపడక
రాముకాంతుండు కుసుమంగ రాడు గాన
తనయకుండగ వడ్డింప గడగు మవ్వ
యనుచు భుజియింప నేగె నయ్యవసరమున. 97.

వ. హేమాయణ నెమ్మనంబున నిట్లుగ తలపోసె. 98.

సీ. జయు పేరు మును విన్న చల్లియించు దేహామి
ప్పుడు వానినే కాంచి పులక లొత్తు
పురుషసింహుని మును పరయ నోడెడి కనుల్
నేడు వాడరు దేర నిక్కి జూచు
తొలుత స్వాధీరు వాక్కుల కుల్కు వీనులి
ప్పేళ తద్వాక్సుధా గ్రోల ద్రివురు

ౖదెననుఁగా నిత్యంబు దలపోయు మతి యిప్డు
ఏని చింతను వీడి వెడల నోడు.

తే. గీ. ఎందు జూచిన నాతని సుందరతర
రూపమే గాని యన్యంబు దోప దకట!
ఏమి జేయుదు సీత డింకెట్టు నాకు
లభ్య మయ్యెడు? నెప్డు మేలౌనో! నాకు. 99.

సీ. ఏనాటికేనియు నానాథు డనురాగవంతుౖడె
నోరార బలుకవలయు
నేనాటికేనియు "హేమ! రావే" యంచు
బలిమిమై కౌగిట బట్టవలయు
నేనాటికేనియు నే తెంచి నాతోడ
సరససల్లాపముల్ సలుపవలయు
నేనాటికేనియు బోనీక నన్నాపి
ముద్దులఁగా గురిసించి మురియవలయు

తే. గీ నట్టి భాగ్య మేనాటికే నబ్బెనేని
దర్పకునినేని పాదాన దన్నగలను
పలుకు లివి యేల యూశతాబ్దంబునందు
నీకు నాకున్నె తోడి పూబోడులందు. 100

ఉ. ఇంతకు బాధలం గుకెచి యెంతయొ ప్రేముడి విన్నవించిన
న్నాఁ-తుడు ప్రీతిమై గనునో? కాదని పోవగ బల్కునో స్వచే
తోంతరమందు నన్నెటు సమన్వయముం బొనరించునో మదీ
యాంతర వృత్తిరీతి దెలియంగనుజాలడె? యేమొ? యక్కటా! 101.

ఉ. కాంతుడు వేడిన న్వినక కాటెయ నెట్టిన బెట్టునిమ్ము నా
పంతము నగ్గసేక సుమబాణుడు వేచిన వేచనిమ్ము జ
న్మాంతరమందు నేని ప్రియు నాదరణంబున కాస్పదంబ నై
సంతసమందగా పర మొసంగి నను౯ దరి దేర్పు దైవమా! 102.

క. దరి జేరి యాతనికి మది
కరుగగ బ్రార్థింతు నన్ను కరుణామయుడై
యరసిన సరియే ధన్యను
విరసం బది యయ్యె నేని విసమే దిక్కౌ. 103.

వ. అనుచు నీరీతి ననేకప్రకారంబుల నెట్టు లీతని బొందుం గాంచు
దాన నని బట్టరాని తమకమ్మున నమ్మానిని కుందుచుండ. 104.

సీ. బ్రహ్మచారులు వేదపఠనంబు జాలించి
సంధ్యవార్చగ సర స్తటుల జేర
పశులమందల పాదపాంసువు పట్టణ
సౌధజాలముల ధూసరము జేయ
గృహిణులు వాకిళ్ళ గృహములతో పాటు
నొదుగుచు లజ్జతో మూడ్చుచుండ
వారకాంతలు మించు వలపు వేషంబుల
విటులకై ముంగిళ్ళ వేచియుండ
తే. గీ. పద్మినీకాంత యపరదిగ్భామగూడ
నేగుచున్నాడు ప్రియు డంచు నెంచి మదిని
కుందున న్ముఖము ముడిచికొనె నన౯గ
చేరుకొనె సూర్యు డస్తాద్రిశిఖరమునకు. 105.

ద్వితీయాశ్వాసము
సమాప్తము.

# జయవర్ధనుడు.

## తృతీయాశ్వాసము.



తే. గీ. విమలకిరణంబు లనియెడు వెండిగోలున
బింబ మను కుంభమున ముడివెట్టి వేల్పు
లమృతసాగరంమందుండు నమృతరసము
చేదుచున్నా రనగ శశి చేరె బ్రాచి. 1.

ఉ. ఆసమయాన హేమ హృదయంబున శాంతి రవంత లేక నా
యాసము నంది చేయదగునట్టి యుపాయము లేమటంచు చిం
తాసముదగ్రచిత్తయయి తాలిమినంది యొకింత కంత వృ
ద్ధాసవిధంబు జేరి వనితామణి మెల్లగ నేమొ జెప్పగన్. 2.

ఉ. ఆదర మొప్పగా ముసలి యాజయవర్ధను చేరి యిట్లనున్
భూదివిజోత్తమా! విరిగ బోటికి చేతను కంటకంబు నా
ర్తాదుల సూరగా తరుగు తత్తరమందున దాని దీయగా
నైదువు నొందు జేకొని తగన్ చనుదెమ్మనె కొమ్మ నిన్నొగిన్. 3.

తే. గీ. అవ్వ యిట్లుగ వివరించి యాత్మయందు
నేమి దలపోసెనో గాని యెందొ పోయి
పండి నిద్రించె; నింగితప్రాజ్ఞు లెందు
దెలిసి దెలియనిచందాన మెలగుచుండ్రు. 4.

శా. సౌధాగ్రంబున నొక్కచోట గదిలో సౌందర్యరాశీకృతన్
పాథోధిప్రసవప్రభూతరుచిసంప్రాప్తన్ చలన్నేత్రి దృ
క్సాధిష్టం బొనరించి బ్రాహ్మణు డనంగక్లాంతుఁడై నిల్వఁగా
సాధారాధరనీలవేణి చిరున వ్వాస్యంబున న్దోపఁగన్. 5.

క. పర్యంకము జూపింపుచు
నార్యా! దయచేయు మిట్టు లనుచును సువచః
పర్యాయంబున బల్కుచు
మర్యాదగ దాను లేచె మానిని యంతన్. 6.

వ. లో జని జయవర్ధనుం డుచితాసనంబున గూర్చుండి దీనవదనంబు
తేటపడ నప్పద్మేక్షణ నీక్షించి వక్ష్యమాణంబుగ బలికె. 7.

క. ఉపకృతి చేయం బూనిన
నపకృతి యిం దెదురయయ్యె నయ్యయ్యో సతీ
చెపుమా యేకారమున ము
ల్లిపు డున్నదో హేల దీసి యేగెద నన్నన్. 8.

వ. సుందరమందస్మితవదనారవిందం బించుక క్రిందకుం వంచి సిగ్గు
వెన్కకుం దిగలాగ నెట్టకేల కగ్గజరాజగమన యిట్లనియె. 9.

క. కరమున గాదది విహగము
సరమర లేకుండ వేయు సంగతి శరముల్
విరిగెను హృదయంబందున
తరుణీమన్మథులు మీరు తగునే తడయన్. 10.

చ. కరమున నున్న రత్నమును గన్గొనలేక సుమారమందున
న్మెరయుచు నున్న గాజున కమేయప్రయత్నము తెన్ని యేని నే

సరయుచు నష్టకష్టముల నంది నిరాశను జెందు మూర్ఖనై
కరము కృశింతు నక్కరుణ గావవె సత్వర మార్యసత్తమా! 11.

ఉ. మీ దగు చిత్తమందున నమేయముగా ననుమాన ముంచు మీ
పాదము లాన నే నిజము వల్కెద మీరలు శ్రద్ధ సొంతముగ్
నాదు చరిత్రము న్వినియు నా దగు శీలము జర్చజేసి యా
మీదను చేయగా దగును మీ కెటు దోచునొ యట్టి కైవడిన్.

చ. కల దొక పట్టణంబు భువి కంకణనామము దాల్చి భాసిలున్
పొలుపుగ నప్పురిం గలుగు భూవిభు డొక్కడు సూర్మయధ్వజుం
డలరెడు సర్వమానసము లాతని ధర్మపథైకపాలనన్,
కలిగితి నొక్కతెన్ సుతను కష్టపరంపర లెల్ల గూర్పగన్. 13.

వ. ఏకైకాత్మజాత నగుటం జేసి మదీయపితరులు గారాబంబున బెంచుచు సంగీతశాస్త్రాభ్యాసముం జేయింప నిశ్చయించి, కలాధరుం డనియెడు నొకానొక విప్రుం బిలిపించి, తత్సన్నిధానంబున మంత్రిసుతుం డైన మదనుం డనునాతని జతపరచి నన్ను న్నియోగించె నంత. 14.

క. మదనునకు నాకు మదిలో
వదలక మైత్రింబు పెరిగె వయసును విద్యా
పదవులు వర్ధిల్లినటుల
సహృదయహృదయ! విన్నవింతు సత్యము జమ్మీ. 15.

తే. గీ వానియందున నాకున్న భావ మెన్న
సోదరాత్మక మైన దో సుందరాస్య!
అతనికిని గూడ నట్టులే యనుచు నేను
దలచుచుండెడిదాన నద్దానిమీద. 16.

క. ఒకరిని విడువక నొక్కొ-ర
నెకసక్కెము లాడుకొంచు నెక్కాలంబుఁ
బ్రకరముగ వల్లె వేయుచు
సకలంబును నేర్చినాము సంగీతంబుఁ. 17.

క. ఇట్టుల కాల మరుగ జా
పట్టంగను నాదు మేన పటుతారుణ్యం
బెట్టులొ గని నాతండ్రియు
కట్టడ గావించె నుండఁగా నంతిపురిఁ. 18.

ఉ. ఆ దిన మాదిగా మదను సఖుల నైనను గాంచలేని త
ద్వేదన నాటినాటికిని వీడగ హాయిగ కాలమెద్దియో
మాదికి నెట్టుచుండ పదిమాసము లేగిన యొక్కనాఁడు నా
కాదరదీనతల్ తెలుపునట్టుల యంపెను వ్రాసి పత్త్రముఁ. 19.

తే. గీ అట్లు మదనుండు వ్రాసి నాకంపినట్టి
కమ్మ యిది యంచు బల్కి యాకల్కి యిచ్చి
నమ్మ్రిన న్నైన దీనిచే నాదు కీల
మెట్టిదై యుండునో మీకె యెఱుగ నేను. 20.

తే. గీ. కాని యెట్టు లున్నదో నాదు కర్మఫలము
విధియు నేరీతి మాకు దోపింపదలచి
నాఁడో! యంచు దీనాస్యయై నాతి పల్క
జయుఁడు మొదలిడె పత్త్రంబు చదువ నిట్లు. 21.

చ. "అతులితదివ్యభోగవిభవాంచితరాజతనూజకుఁ బుధ
స్తుతమతితోడి పాండితిని శోభిలు బాలకు చంద్రలేఖకుఁ

ప్రీతి యను మాటలేని గుణపాపనికిన్ భువనైకమోహనా
ద్భుతసుకుమారికి న్విమలధర్మిణి కియ్యది హేమకన్యకన్. 22.

ఉ. కంటికి కానరాకునికి గర్వ మిపోయెను నిన్ను జూడ వా
ల్గంటిరో! యేమి జెప్పుదును గానము సాధన జేయబూన నీ
వ్వెంటనె సంచరింతువని వేరుగ జెప్పగనేల? దీనిని
వింటివె? భోజనంబు కడు నెక్కుసమాశ్రితవాదవీచికన్. 23.

తే. గీ. నాదు హృదయంబు నీయందు నాటికొనియె
సిగ్గు విడనాడి నీతోడ జెప్పుచుంటి
నొల్లకున్నను నాప్రాణ ముంచదింక
ప్రేమమైత్రింబు నైనను పరిగణింపు. 24.

తే. గీ. ప్రతిదినంబును నాకు సంబంధశతము
వచ్చుచుండుట నాతండ్రి వచ్చినన్ను
పెండ్లి కంచని బలవంతబెట్టుచుండె
నాశ నీపైన నుంటచే నాగియుంటి. 25.

వ. నీవు నన్ను సోదరునిగా భావించు చుంటివి. 26.

ఉ. ఇంతకు పూర్వమందున మనీయహృదంతర భావ మంచి నీ
చెంతను దెల్పగన్ వెరపు జెందుచు మానితి నిప్పు డన్న సా
వంతయు భీతి లే దబల! బాగుగ నాపయి గోపగించి చిం
తింతువుగాని యీ పనికి నెక్కుడు జేసెడి దేమి సన్నుతీ! 27.

ఉ. వచ్చిన మేలెగాని యిటు వందురు బాధకు నోర్వజాల నీ
వెచ్చని గాలి నాతనువు నేపుచు నున్నది యేమి జేసినన్

మెచ్చవగాని యో తరుణి! మేనను బ్రాణము లుండుదాక నే
మెచ్చ త్వదన్యసుందరిని మీఁదట నీ దగు చిత్త మెట్టులో. 28.

తే. గీ. పత్త్ర మైనను వ్రాయు మో పద్మనయన
మిత్త్రహత్యయు నీ నెత్తిమీఁద బడుటఁగా
నీదు కెమ్మోవిరుచులను నేను గొనుటఁగా
గాంచి సంతోష మందెద కనకవల్లి. 29.

వ. ఇట్లు త్వత్ప్రియమిత్త్రుఁడు మదనుఁడు" అని జయవర్ధనుండు లేఖం
జదువుట ముగింప మరల నారాజముఖి యిట్లనియె. 30.

శా. ఆ లేఖన్ తుదికంట జూచి కడురోషాయత్తచిత్తంబుతో
నాలో నే నిది వీని కిట్లు గలిగెన్ హా యిట్టి దుర్బుద్ధి యం
చాలోచించి విచిత్ర మంది యెటు జేయన్ లేక మూఢాత్మనై
ఏలీలన్ లిఖియింప నేమగునొ వా డిప్పట్ల నం చీగతిన్. 31.

తే. గీ. ఎదుట బడి వాని కెల్లైన మదిని మార్పు
జేయుట సమంజస మటంచు చింత జేసి
స్నేహబలమున నిట్లుగ సాహసించి
వ్రాసి యంపితి మరలను పత్త్రి మొకటి. 32.

వ. "శ్రీమదశేషబుద్ధిమదగ్రేసరుండైన మదనమిత్త్రునకు కృతానేక
నమోవాక్శోభయుకుశలోపరి హేమారుణ వ్రాయు విశేష మెట్టి
దనిన. 33.

తే. గీ. నీవు వ్రాసిన పత్త్రిక నేడు చేర
నందు గల సంగతుల నెల్ల నరసికొంటి

నీదు విపరీతబుద్ధి కన్నా! దురంత
తాపసంతతి వేగ మత్స్వాంతవీధి. 34.

క. అయినది యేదో యైనది
నయనము నిశీథ మైన పాటున రేచే
హయశాలవేదిమీఁదకు
దయచేయుము పూలవనికి దరలుద మచటన్. 35.

క. అటుపైని మాటలాడుద
మెటు వీలగు మనకు నటుల నేమియు మఱి నీ
వటులిటులంచని వ్రాయకు
మిటుపై విరమింతు జేయు మీవును నటులే." 36.

తే. గీ. అనుచు లిఖియించి యంపి నే నవని దేవ!
వలయు సన్నాహ మంతయు వలనుపఱచి
యంతిపురమును దిగవిడి యరుగుదెంచి
మిమ్ము వానిగ భావించి మేలుకొలిపి. 37

వ. పుష్పవనంబునకుం బయనించుచుండ నింతలో నిశాటవాహినులు వెన్నంటి తఱుమ మహాభయంబున యథేచ్ఛం బోనిచ్చెడి మన యశ్వరాజంబుల వేగంబున కోడియును, భానూదయసమయంబు వరకును మనల వెన్నాడి ప్రయోజనంబుం గానక వదిలివేయుట లాదిగా గలుగు యావద్వృత్తాంతంబును త్వదంతఃకరణగోచరంబే గదా. 38.

చ. అన విని హాసచంద్రిక నిజాననమందున దోప భూసురుం
డనియెను శంఖనాదనిభమైన స్వరంబున యిట్లు పొందుగా

వనరుహపత్త్రలోచన! యభావవిరక్తిని యిట్లు పల్కితే
విను మత డిప్పుడి న్వాలసె వేగమె చెప్పుము తోడితెచ్చెదన్. 39.

ఉ. వానికి నప్పగించి నిను భవ్యచరిత్రుఁడ నౌదు నంచు నే
వేనియు చెప్పబోగ యలివేణి సగద్గదకంఠరావమై
తా నను ప్రాణము ల్విడిచి తప్పక ముందుభవంబునందు నీ
మానస పొందెదన్ పతిగ మామకవాంఛ నిరాకరించుచోన్. 40.

ఉ. జలనిధి సాక్షిగా తరణిచంద్రులు సాక్షులు గాగ వేదముల్
కులగిరు లెల్ల సాక్షులుగ కోయిల సాక్షిగ సాక్షి గాగ బూ
విలుతుఁడు విన్నవింతు వినవే; భవదంఘ్రుల యాన వానిని
న్కలనయిన న్వరింప నిది గట్టిగ నమ్ముడు పెక్కు లేటికిన్. 41.

చ. అనవుడు విప్రసూను మనమందున వాటముగాగ నేయు న
మ్మనసిజ తీక్ష్ణబాణకృతమర్మవిదారణబాధ కోపమిన్
వనరుహనేత్రవంక గని పల్కదొడంగెడి నిట్లు "నాయెడన్
మనమున నన్యథా గనకుమా! యనుమానము మాను మానినీ.

చ. తనకుగ తానె వచ్చి వనితామణి కోరిన నొల్లకుంట కే
నన శుకమాని నౌకొ? ప్రవరాఖ్యుడనో జనకాత్మజావిభుం
డనో? భవదీయమానసదృఢత్వపరీక్ష నొనర్ప నెంచి సు
మ్మనయము నట్లు పల్కి వెత లందగ నీమతి జేసితిన్ చెలీ. 43.

చ. అనగనె యప్పడంతి శిర మల్లన గాల్కొని సిగ్గు వంపగా
గనుగొను చోరచూపులను కాంతుని పయ్యెదకొంగు చేతితో
బెనచుచు గాలియంగుళిని పృథ్విని రాయుచు విన్నబోయియే
మనకయ నిల్చె తద్వనిత మానస మెన్నగ మెచ్చె బాగదా, 44.

తే. గీ. పల్లవాధరి ప్రాణాలు పల్లవింప
నంచనడకల మెల్ల నాయకుని జేరి
దాచియుంచిన మందారదామ మతని
కంఠసీమను వైచె నుత్కంఠ మెఱయ. 45.

క. దిగ్గన లేచి జయుఁడు కే
లొగ్గుచు దరి జేరదీసి యొండొక మాలన్
దిగ్గజయానకు వైచుచు
బిగ్గ కవుంగిటిని జేర్చె వేవేగముగన్. 46.

వ. అంతట లజ్జ లజ్జపడి పజ్జల కోసరిల్ల నత్తలోదరి చిత్తజవికారంబున నత్తమిల్లి బిత్తరిజూపుల జూచుచు జక్కవల హసించి నిక్కి పిక్కటిల్లి క్రిక్కిరిసిన చన్నుబ్బల నక్కంజజాన్వయజాతు నక్కున నెక్కిడి నొక్కిడి భారం బాతని యందనిడి మోము పై కెత్తి మోముం జూచుచు మోవిపానకం బాను భారం బాతనియందు బెట్టి, నాల్గుకెల్లంకుల నాలోకించు రీతిం జూచుచు వాల్గంటి గీల్గంటువేత్రుల గాటం బగు పాటవమున నాటజేయు కైటభమర్దనుని యాదట పుత్రుం డాగక వాటము జూచి తాటోటుజేసి తాటించిన కోలలో యన నొప్పు నప్పారుం డోటువడి యప్పాటలగంధి మనోరథంబుల నెల్ల క్రమంబున నిర్వర్తించె నప్పు డబ్బోటికి. 47.

ఉ. చందురు వంటి మో మపుడు చల్లబడెన్ విడిపోయె వేణి త
ద్బంధితపుష్పమాల కడు వాడెను వీడెను నీవిబంధనం
బిందునిభాస్యయున్నలసె నింత చలించెను బల్లవాధరం
బందె నఖక్షతాంకములు నండజయాన పయోధరంబులన్. 48.

వ. అంత కొంతకుం దెప్పిరిలి యత్తన్వంగి తాటంకాంతతరంగితాక్షి
యుగళంబుల నప్పళించుచు మెల్లగ నిట్లు పలికె. 49.

తే. గీ. పొలతులకు సిగ్గు వెలలేని భూషణంబు
దాని విడనాడి యిట్లు మీ దాపు జేరి
వదరియుండిన తొందరపాటు వేఱె
దలప వలదని ప్రార్థింతు ధరణిమదన. 50.

ఉ. నావుడు మందహాసవదనంబున దానికి నుత్తరంబుగన్
భావన సేసె నేమొ యటువంటిది గానిమొఱన్ నిరుక్తికం
బావనజాక్షి జేరి బిగియార కవుంగిట జేర్చి చుంబనం
బావగ జేయునే? ప్రియులహావము లిట్లుగ నొప్పు నేమొకో. 51.

తే. గీ. ఇట్లు లానంద మంతంత కినుమడింప
తనుల మఱచుచు నంతలో దరలి మరల
సరసవచనాల నాడెడు సమయమందు
ననియె నుల్లాసమును వీడి యతని కాంత. 52.

సీ. మదను డీపురి జొచ్చి మసలుచున్నా డంచు
వాకృచ్చి రేమిటి? వాని కిందు
గానశాస్త్రమునందు కదనంబు సల్పెడి
వారలున్నా రె? యీయూరియందు
బంధుత్వ మేర్పడిన బరగియుండెనె? యేమి
తీరికెట్లయ్యె నీతీరు తిరుగ
నేనిందు నుంటినంచె న్గైన గుర్తించి
పిత వీని నిటకు బంపించె నేమి

తే. గీ. కరుణఁ జూపక యున్నచో నెంత మీరను
కష్ట మేదైన మనసునైన కల్పనంబు
చేయు నేమొకో? యంచు నాచేతమందు
సంతతము తోఁచుచున్నది సంశయంబు. 53.

క. నాపుడు జయుడను నారా
జీవదళేక్షణను గాంచి చిఱునవ్వున "యీరా
భూవిభు జామాత యగుట
డా వచ్చెను మదను డిట కుదాత్తత నొయ్యన్. 54.

క. మదనుడు పసి బలి కసి ప్రి
ల్లదముల విని సూడిగంచు గర్వపు బల్కన్
మదమును విడువక యటులే
నదరగ నాలించి కినిసి పల్కితి నిట్టుల్. 55.

క. చేయింపుడు సభ లేవే
నాయోపిన యంత పట్టు నయమ్మున నేనే
గాయకుడ నగుదు సభకున్
నాయకు నేర్పరచి చెప్పుడు న్యాయము దీర్పన్. 56.

ఉ. నా వినిని విన్నబోటు వదనంబున దోఁపగ తోయజాక్షి భూ
దేవకుమారునిం గనుచు దేవరశక్తి నెఱుంగ గాని త
ద్భావజనామతో సరిగ భావన సేసిన బోల తెయ్యసం
తావలయంబునన్ గల జనంబు త్రికాలములందు నేనియున్. 57.

క. స్వరముల కల్పనచాతుర్య
నెరవుల లలితంపు కూర్పు నేర్పున ఘనునా

సరిచేసి పల్లవాదుల
నరిసి నుతింప దర మూనె? యంతటిలోనన్. 58.

క. ఆతని తోడను బోరుట
యేతన్మాత్రింబె? తలప నేకైతవమే
నూతగ గోని విరమించుట
యే తగినవిధాన మంచు నెంచెద బుద్ధిన్. 59.

వ. అనుచు జెప్పంబోవు నప్పూవుంబోడిం గని మోమున చిరున వ్వొ
లయ నాజయవర్ధనుం డిట్లనియె. 60.

క. జయ మేరికి చేకుఱు నప
జయ మెవ్వారికి నటంచు జర్చింపంగన్
జయ మున నొక్కని సొమ్మా?
భయ మెందుల కిందు ముందు పర్వేందుముఖీ. 61.

క. రేపా వాకిట సభలో
పాత్రిసితఘనయవనికాంతరాళవ యగుమన్
మూపాటల నాలింపుము
లోపంబుల నెన్ననచ్చు లోలమృగాక్షీ. 62.

వ. అనిన. 63.

క. అంభోజనయన యిట్లను
సంభావితసకలశాస్త్రసారులు మీకా?
జృంభించి దోసగు లెన్నుట
డింభకము గని గ్రుద్దు నవ్వు కీవి దలిర్పన్. 64.

వ. అని వారలు చమత్కారవచనంబుల జర్పింపుచుండ నింతలో. 65

ఉ. కొక్కొరొకో కొక్కొరో యనుచు కోళులు కూసెను వీచె మందతన్
జక్కనపుఁ సమీరములు తమ్మికొలంకుల దేలి యాడుచున్
చుక్కలు నొక్కటొక్కటిగ నుఱిక్కెను; తిట్టగ నవ్వదంపతుల్
జక్కెరవింటివాని వెడసాయకపంక్తికి జిక్క కాలమున్. 66.

ఉ. తేనియతిండి బంధనము దీఱెను కంజము లెల్ల విచ్చుటన్
మానుగ తత్సహస్రకరమండలి బర్వగ జేయు సూర్యునిన్
మానిసతీలలామ నవమాసము నెంచిన పాతకుండగున్
వీనిని గాంచగూడ దని వేగమె వంచె శిరంబు కల్వయున్. 67.

తే. గీ. జయుడు స్నానాదులం జేసి చలువవలువ
లను ధరించి వీణను దెచ్చి రాగరసము
విన్నవారల నెల్ల స్తంభింపజాలు
రీతి బాడి సాధక మాచరించి మించ. 68.

క. సంతసము సాధ్వసంబును
సంతృప్తియు నంది హేమ సంధించెడి న
త్యంతము ఘను లుభయులగుట
నంతఃపురి కేగి గాన మాలింపంగన్. 69.

క. జయుడును సాయంకాలము
పయనం బాయత్తపరచి పంపుచు హేమన్
హాయ మొకదానిని జేకొని
రయ మొప్పగ రాట్సభాంతరంబున కేగెన్. 70.

ఉ. కొందరు వేదపండితులు కొందరు కేవలశాస్త్రవేత్తలున్
కొందరు గాయకుల్ మరియు కొందరు నిశ్చలదైవవిజ్ఞులున్
సుందరకావ్యకర్మఠులు జోదులునింక ననేకమాన్యులున్
మందిరమంటపంబున సమంచితరీతి నలంకరింపగన్. 71.

ఉ. ఆసభయందు గల్గు ప్రజలందరు దిగ్గన లేచి మ్రొక్కగా
నాసచివోత్తముండు మరియాదగ దాను నమస్కరించి రా
నాసమమాన భూపతి సమంచితరీతి జహూకరించి య
వ్వాసన మొండు జూప వినయంబున జేరి వసించె దానిపైన్. 72.

ఉ. అందల మెక్కి హేమ చని యంతిపురంబున రాజపత్నిచే
బొంది విశేషగౌరవము భూపతిపత్ని సుతాసమేతయై
యందొకచోట జేరి తగునాసనమం దుపవిష్టయై మహా
నందము గూర్చె వారి నయనంబులకున్ నిజరూపసంపదన్. 73.

తే. గీ. జయుడు మదనుండు వచ్చి యాసభకు మధ్య
వేదికాంతరమున నుపవిష్టులౌచు
వీణలం గొని తంత్రుల వేడ్కతోడ
మేళవించిరి పార్థనల్ మిన్నుముట్ట. 74.

చ. తదుపరి రీతిగౌళ యటతాళపువరము మూడుకాలముల్
మదనుడు వీణపైని మృదుమార్గమునన్ రుతిసేయ జూచి సొం
పొదవగ దానినే జయుడు పూర్తిగ బల్కగ జేసి యంత దా
మ్మొల్లలిడెనొక్కరాగ మదిమోదమున న్మదనుండు బల్కియున్ 75.

క. రాగము సౌరాష్ట్రింబున
వేగముగా స్వరము నెరవు వేయుచు నెలమిన్

"శ్రీగణపతి సేవింపర"
నాగను కృతి బలుక జేసె నయమున దానిర. 76

వ. జయవర్ధనుడు జేతోమోదంబున న్వాయించి "సరసీరుహాసనప్రియే" యంచు కృతిని "నాట" యారంభించి భైరవ్యాదిరాగంబులును పలికింపజేయ దత్తదనుసారియై మదనుండు గ్రిమ్మర. 77.

క. "బాలా గోపాలా" యను
మేలౌ నొక కృతిని వేసె మించిన మదితో
నాలాపనాదు లీనుచు
నాలో ముక్తాస్వరంబు నంతట నెరవుర. 78.

క. దానిని వాయింపం గని
మానసమున జిన్నవోయి మదనుం డటుపై
తానము నవరాగంబుల
వీనుల కింపొదవజేసె వీణియ మీదర. 79.

తే. గీ. అదియు వాయింప గనుగొన్న మదను డంత
వీణలం దీసి గాత్రాన వేడ్క బాడ
బాగుగా నుండునం చెంతు భావమందు
నవిన నల్లైన గానిం డటంచు జేసె. 80.

ఉ. అంతట తోడిరాగమున నాలపనం బొనరించి పిమ్మటర
సొంతముగా నొనర్చి కృతి సొంపుగ బాడిన వర్ధనుండు వా
వింతగ దానికే నెరవు వేయుచు సుస్వర మెల్ల నంటగా
నంతట వెంబడి న్మదను డాహిరిరాగము పాడి దానిలోర. 81.

వ. గ్రహాపస్తారాదులం జేసి "కృష్ణ! మాం పాలయరే దను జాం
తకాః" యటంచు షట్కాలపల్లవిం బ్రారంభించి, విషమాంతరగతి
మార్పుల యెత్తుగడల ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థకాలం
బుల నాటిపై కాలంబాన శక్తిచాలక మానవడయ్యె. నట్టి యవ
సరంబున జయవర్ధనుండు. 82.

క. మెల్లగ షట్కాలంబుల
పల్లవి దా మొదలువెట్టి పాడగ మదిలో
పల్లవితు లౌట బ్రేషకు
లెల్లరు గననైరి బొమ్మ లేమోయనగన్. 83.

వ. అట్టియెడ మదనుండు లేచి, వినయంబు మెఱయ నిట్లనియె. 34.

ఉ. వందలు వేలు గాయకుల వాదుల బాడితి నెప్పుడున్ జయం
బందితి నారుకాలములయందును పల్లవి పాడ గల్గువా
డెందును లేడు నేనె యిటు లెట్టులొ పాడెద నాల్గుకాలముల్
విందయి దోచె కండ్లకును వీనుల కిప్పుడు నేమి చెప్పుదున్. 85.

క. నారదుడో తుంబురుడో
శారదయో వృష్ణికులజసత్యాపతియో
ధారుణి జయుడై పుట్టెను
గారణ మేదేని గల్గు కతమున నిట్టుల్. 86.

క. అని మదనుడు వడి జయవ
ర్ధనునకు సాష్టాంగ మిడియె- ధన్యుడ ననుచున్
జనకరతాళరవమ్ములు
మిను ముట్టెను దిశావకాశ మేదుర మగుచున్. 87.

సీ. బ్రహ్మదేవునితోడ బగగొని వేదాలు
స్వస్తిగా జెప్పంగ జాలువాఁడు
శేషాహితో వాదు సేసి వ్యాకరణశా
స్త్రమునందు గెల్వగా జాలువాఁడు
తర్కశాస్త్రాంభోధి తరియించి నిల్చిన
గౌతమాదుల నోర్వ గల్గువాఁడు
గానాబ్ధి నొక్క గుక్కగ గొన్న తుంబురా
దుల నాదమున దూల్పగలుగువాఁడు.
తే. గీ. భూరిపండితసమితికి భోజపతియు
రాజ్యపాలనయందున రామరాజు
సని జనంబులు కొనియాడి రపుడు ప్రీతి
నున్నవియు లేని గుణముల నన్ని జేర్చి. 88.

వ. ఇంకను జయవర్ధను నెరుంగని మరికొంతమంది. 89.

ఉ. అమృదుగాన మామధురహావము లాసరసంపు భావ మా
కామితమార్గగామి యగు గాత్రజవంబున సొంపు నింపు లా
తామరసారిసన్నిభముదప్రిదరూపమ పాండితీమహం
బేనుహాసియపండితున కేనియు గల్గునె లెక్క కెన్నగన్. 90.

చ. అనితరసాధ్యమైన మదనాహ్వయు డెక్కడ? నామమందు బ్రా
హ్మణు డితి డేడ నంచు మనమందు దలంతుముగాని యిట్టి స
ద్ఘను డని యెంచబోము భళి! ధాతకె వంకల బెట్టజాలు నీ
యన యని చెప్పికొంచు జను లందఱు నేగిరి యొక్కరొక్కరై.

చ. దినకరు డేగ బూర్వదిశ తెల్లెలవోయెను పద్మినీసతీ
మణివదనంబు సొరుచెడె మందసమీరతరంగపంక్తులన్

వనజముఖీలలామలను భర్తల రాకల తొందరించు కే
గెను మరుఁ డైదుతూపులను గీటుచు ధాటిగ మాటిమాటికిన్. 92.

వ. అట్టి సమయంబున క్రమక్రమంబుగ జరుగుచున్న ప్రస్తావనవశం
బున జయవర్ధనున కామదనుం డిట్లుగ జెప్పదొడంగె. 93.

చ. ఇచటికి నాల్గుయోజనము లేగిన యంతట గల్గు కంకణం
బచటి పురాధినేత కలరారెడు ముద్దుకుమార్తె మేలుమేల్
సుచరిత చారిమంబు సురసుందరుల న్తలదన్నజాలు న
న్వచనముకన్న వేరె యిట వర్ణనజేసి వచింపనేటికిన్. 94.

తే. గీ. అట్టిజగదేకసౌందర్య ముట్టిపడెడి
కలికిమిన్నయు నేనును కలసి మెలసి
యల కళాధరుడను నొజ్జ నాశ్రయించి
గానశాస్త్రము నంతయు గఱచినాము. 95.

క. ఆమెయు నన్నుం గన్నను
ప్రేమించును సోదరుండురీతిని నేనా
సామజయానను గాంచిన
కామంబున మాటలూరి కగ్గుచునుందున్. 96.

ఉ. అంతట నామె మేన గనవచ్చెడు యౌవనచిహ్నముల్ మహీ
కాంతుడు భార్యనుండి విని కాంచియు దానికి నుత్తరంబుగా
నంతిపురంబు జేర్చె నపు డామెను గాంచగ వీలులేక నే
నెంతయొ బాధనంది సహింపగలేకను తుచ్ఛబుద్ధినై. 97.

ఉ. నాదు నవస్థ గూర్చి కడు నమ్రిక జాలియు బ్రేమ గొల్పు న
మ్మాదిరె పత్రిక న్గిలికి మానిని కంపితి దాని గాంచి యా
గాదిలి పూవుబోడి మది గాంచెనొ జాలిని లేక యేమిగా
నాదృతి జేసెనో? మొగుగ నవ్వల నాకిటు లుత్తరంబిడెన్, 98.

తే. గీ. అనుచు బల్కుచు లోఁగడ హంసయాన
యంపియున్నట్టి పత్త్రము నందఁజేసె
జయుఁడు సాంతము దానిని చదివి చూడ
నందు నాహేమ వ్రాసియిచ్చినట్లు యుండె. 99.

క. ఆయమనసనాటికి నొక
గాయకు జేతేర నాఁడె గానమునందుం గా
మాయయ యొక సభ గూరిచి
పాయక నన్నందు పాడ్చెఁ బ్రారబ్ధమునన్. 100.

తే. గీ. ఆ మరుదినంబు సూర్యోదయమున నాఁడె
నంతిపురమున గనగరా దబల జాడ
"హా" రవము లెల్ల చోటుల నాక్రమించె
నేమిజెప్పుదు ముదుసలిభూమిజాని. 191.

క. వెదకించిరి వెదకించిరి
వెదకించియు వెదకి వెదకి వేసారిరి యా
మదవతి సంగతి సుంతయు
నిది యని దెలుపంగజాల రెవ్వరుగూడన్. 102

చ; కుడువరు భోజనంబు దమకూరిమిబిడ్డను బాయు బెంగచే
గడవలకొద్ది నశ్రువుల గార్చుచునుండెద రెట్టివేళలం
దొడయడు రాజకార్యముల నొల్లఁడు నేమియు జెప్పఁబోఁడి ట్టి
గొడవకు గొంతకారణము క్రూరుఁడ నేన యటంచు గుందెదన్.103.

చ. అది యటులుండనిం డిపు డిదంతయుగూడను దెచ్చి నెత్తిపై
పదిలముగాఁగ నాకు నిడె బాపపులోకము నేమిచెప్పుదున్
ముదుసలిరాజదంపతులు పుణ్యసమంచితచిత్తు లొక్కనా
డది యుదియంచు దోసముల నాడఁగ బోరిది చిత్రమయ్యెడిన్.104.

ఉ. వారల బాధ వాపగను వచ్చినవారలు తప్పిపోవగా
నారమణీమణి న్వాదుకనై యిటు వచ్చితి వచ్చె నాకిటుల్
భూరమణాళిపూజ్యుఁడ! యపూర్వభవద్వచనామృతంబులన్
సారము గ్రోలగా మరల చయ్యన వచ్చెద రేప యేగెదన్. 105.

వ. అన విని జయవర్ధనుండు మందహాసంబున మెల్లగ నిట్లనియె. 106.

ఉ. మీదగు బుద్ధిజాతికిని మీదగు మంచికి మీదు శక్తికి
న్మోదము నందకుండునె? యమోఘముగా నెవడేని యుంచు నా
వేదన మూచరించి యిది వేసటగా దలపోయబోక నా
మోదము నంది మాభననమున్ మముబూతముజేయ రండన్న 107.

క. సరియే యన నుదనుం డప్పు
డరుగంగా సాగినార లయ్యిరువు రటా
యరిగిన హేమయు నింటన్
త్వరగా మున్నాబు నంది తత్తరపడుచున్. 198.

ఉ. ఎప్పుడు వచ్చునో రమణు డెప్పుడు నేనెదు రేగి కౌగిటన్
జొప్పడ జేతునో మదిని జొచ్చిన తజ్జయకౌతుకంబు నెం
పొప్పనుతింతునో ప్రమద మొప్ప కవుంగిట గూర్చి సుద్దులన్
జెప్పుచు ముద్దు వెట్టుకొని చెచ్చెర నెన్నడు గారవింతునో. 109.

క. స్వరమా! తానమ! నెరవా!
సరి విషమంబుల బలికెడి షట్పల్లవిహా
తరమా? పాడగ నొకరికి
సరియేమో మదను డనుట శారద యేమో. 110.

తే. గీ. అనుచు జింతించుచుండె పర్యంకశయన
యొగుచు నింతలోన జయుడె యగపడంగ

నెదుర జన నెంచి డిగ్గ నయ్యెందువదన
కెదుట ప్రత్యక్షమయ్యె నావనను వంత 111.

ఉ. చీరల గాంచి యాయతిన భీతియు సిగ్గును సంభ్రమింపగా
నోరగ లేచి నిల్వబడి యుబ్బెడి సిబ్బెపుగుబ్బదోయిపై
చీర ఘటించి కాంతు ముఖసీమను నోరగ జూచుచుండ నా
సూరిమనంబు నిప్పుసెగ సోకిన లక్కవలెన్ గరంగె నాన్. 112.

క. జయు సోమదనుని బిల్చుచు
నయమున సమ్మానమిచ్చి నారీమణితో
బ్రియసఖు డరుదెంచె నినున్
రయమున గని యేగు కాంతు రాణివాసిన్. 113.

క. కావున నో భామిని! యే
భావము మదియందు నిడక పల్కుము ప్రీతిన్
నావుడు చిన్నతనంబున
నేవిధ మాట్లాడ నోడి యిట్లనె కడకున్. 114.

క. అన్నా! సన్నుతచర్యుని
సన్నిధి మన చిన్ననాటి చర్యల నెల్లన్
మన్నించి ప్రాసగుచ్చిన
చెన్నున సుషువంగ వలయు జెచ్చెర నిపుడున్. 115.

క. ఇంకొక కోరిక వినుమీ
పంకిలమై దనరు నీదు పతితపుబుద్ధిన్
సంకోచింపక వీడ్కొని
యింక నన్నను భగినిగ నెంచుము మదిలోన్. 116.

క. ఇందుల కొప్పిన యప్పుడే
పొందుగ భాషింప్రు మనుచు బుద్ధియు పలుకన్

మందముగ గాంచినయపుడే
డెందమున న్స్వధ్వసాన డీల్పడి యంతః. 117.

వ. మదనునకు లజ్జ గుర్తింకువను మానస మొప్పగ సోదరీమణీ
యిదివరకే మదీయహృదయేప్సిత మెల్లను మాటిపోయె నీ
మది గల వేదన న్విడిచి మాన్యత సోదరభావ మహానుమా.
యుదిత తయార్ద్రచిత్త వయి తార్చుము నాదగుతప్పు సైపుమా.

ఉ. నీదు నదృష్ట మెంతని గణించి నుతింతును? నీదు భర్తకు
న్సాదరి వచ్చు శక్తిగల మానిసి యీ భువినిఁ హుళిక్కి దా
మోదరు పొందుపొందు రమ పోలిక నీశ్వరు నీవు జేసి కో
నాదట గౌరి తాబడసినట్టి సతీమణి బోలె దీవునుఁ. 119.

వ. అని బహుభంగుల నుతించు మంత్రిపుత్రుని రాజపుత్రి ప్రహర్ష
జనితపులకలలితగాత్రియై వేవిధంబులగౌరవించి క్రమంబున మాతా
పితృబంధుహితపరివారంబుల వేర్వేఱ నడిగి స్వీయపవిత్రచిత్రచరి
త్రిను, తదానీంతనభీతికుశలమహానందాశ్చర్యసంభ్రమావిర్భావా
దులనుం దెలిపి, స్వయంగ్రాహవరనిర్ణయబుద్ధివిశేషచాకచక్యంబు
లును, తదీయాద్వితీయసర్వశాస్త్రప్రవేశంబును, తదీయగానశాస్త్రా
నర్గళగళవిశేషపశ్యాలపల్లవ్యాదిసముల్లాసనంబులను, పొగడిబొగడి.

తే. గీ. ఈయదృష్టంబునకు నీవ హేతు వనుచు
లేకయుండిన నాకు ఈరీతిభర్త
దొరకునేయంచు నేమేమొ తోయజాస్య
పలుక జయుడు మదనుతోడ బల్కె నిట్లు. 121.

తే. గీ. ప్రొద్దుపోయెను మాయింట భోజనంబు
జేయుద మనిన నట్లె దా జేసి లేచి
పోయి పండెద రేపు నే బోయి యుగ్రు
యధ్వజునితోడ వచ్చెద నంచు జెప్పె. 122.

చ. సగము గతించె రే యమృతసాంద్రకరంబుల చాపి జాపి యీ
జగముల నెల్ల మోహమయసాగరమందున ముంచి చూచుచుఁ
ఖగతుడు నిండుచందురుడు కాంతిలుచుండెను లోక మెన్నగా
సగపడు తత్పరిస్థితుల నాత్మపరిజ్ఞ మనంబు కై వడిఁ. 123.

చ. మదనుని సాగనంపగను మానిని! యీజయవర్ధనుండునుఁ
పదవిని జేరి రానగరువంకకు నూరు గజంబు లేగి యీతని
న్వదిలమటంచు వీడ్కొలిపి వచ్చెడి త్రోవను భూసురుండు నా
మదగజయానతో ననెడి మాటల విన్నను మోద మయ్యెడిఁ. 124.

ఉ. పర్వపుచంద్రబింబమున బల్మరు నంకల నెన్నజాలు నీ
హార్వగు నెమ్మొగమ్ము గని యాత్మ విధుంతుదు డెంచి భీతిచే
నుర్వికి చేరినట్టి విధుఁడో! యిది యేమి యుపద్రవంబుకై
బర్వెనో! చెప్పజాల చెలి! నైశమ యేగును యింటిలోనికిఁ. 125.

చ. అనియెడు ప్రాణవల్లభుని యాదరపూర్వకమైన వాక్కులఁ
విని ముదమంది హాసమును వెల్వడ "మీరు మదీయవృత్తమును
స్మరణమున శంక జేయుటలు మాని, ననుం గొన నా యదృష్ట మే
మనియెద; నన్ను బోలు సకియా, రతియా, నహియా, వయామయా.

మ. మరునా డంతట సూర్యధ్వజుడు సన్మంత్రజ్ఞులు న్మిత్రులుఁ
వర సేనానివహంబులు న్మదనుడు న్వర్తింప దోడ్తేచు దా
నరుదెంచె న్మరిపంపుగూతు గనగా నౌత్సుక్యమును జేసి, యీ
సరణిం బా విని రామకాంతుడు సముత్సాహంబు పెంపారగా. 127.

కం. జయవర్ధనుడును దానును
నయమున నెదురుగను బోయి నానావిధులఁ
కయిసేసి కంకణాధిపు
ప్రియపుత్రిక జేర్చిరపుడు వేడుక మెఱయఁ. 128.

ఉ. ఊర్మిళయు కేతుమంతుండు నతియు నుత్తము ల్తో జయు నంత గాంచి లో
శర్మము నంది కూతుగని చయ్యన గౌగిట జేర్చ బాష్పముల్
నర్మిలి జేసి కాల్వలయి నాతి దలన్ దడుపంగజొచ్చె మేల్
ఘర్మజలంబుబిందువుల గాత్రము లత్తఱి మున్గె చిత్రడిన్. 129.

మ. అల నా మువ్వురు నాల్గుగైదు నిముసాల్లశ్రైై విచారంబునన్
పలుకంజాలక యుండ హేమ యను “నీపాపాత్మురాలిన్ ననున్
తిలకింపంగను వచ్చినారె యిటు బ్రీతిం జేసి యోతండ్రి! నా
వలనన్ మీకొనగూడె దుఃఖములు జీవం బేల? ఛీఛీ” యనన్ 130.

క. అమ్మా! యిట్లనియెద వే
మమ్మా! కంటి కగపడితి వంతియ చాలున్
సమ్మోద మయ్యె వగవకు
మమ్మాటికి నమ్మ మంచు ముదుసలు లనుచున్. 131.

వ. కూతు నాశ్వాసించి పదంపడి యితరప్రస్తావనమున నూర్మిళయు కే
తుం డిట్లనియె. 132.

చ. చిలుకయు గోరువంకయుటు చిన్నెలు వన్నెలు గల్గి రూపవి
ద్యల సుసమానులై యొకరియం దొక రెంతయు బ్రేమముంచు ని
స్త్రీపుమిథునానురూపముగ మానుకప్రుతికి నాథుని న్దయం
బొంచి యొసంగుమా యని విధాత ననేకవిధాల వేడితిన్. 133.

క. కూతు మువముకన్నన్ జా
మాత ముదంబె మున మాచు మది దోచెనీ ని
స్నేతద్విషయము లిప్పుడు
చేతము నన్దృష్టినంద చిగురొత్తె దగన్. 154.

వ. నిన్నటిదినంబున మనసుంచు నాచెంత కరుదెంచి మీచరిత్రంబు
నెల్ల జెప్పుచు. 135

ఉ. నీదు సదృష్ట మెంతయుచు నేకొనియాడెద నంచు శ్రీకళా
పాదుకొనంగ జేసి జయవర్ధను సంగతి వాంఛితీమహాం
బాదట రూపసంపదయు నత్యధికంబు నుతించి దెల్పె నా
ఢాదిగ నామనంబు ప్రమదాంబుధి దేలుచు నోలలాడెడిన్. 136.

క. తనుజాతయైన గానీ
తనుజుండే యైన గాని దానొక్కటె యే
దన రెడు జయవర్ధన! గా
వున నారాజ్యభర మీకు భుజముల జేరెన్. 137.

ఉ. కావున నీవు నీసతియు గంకణరాజ్యము జేరి భూమిభృ
ద్భావము నంది మిన్నయు పార్థివసత్తముడంచు బిడ్డల
న్భావముతో బ్రజావళిని పాలనజేయు దటంచు మంచి పే
రానహీలం జరింపు; ముది నైతిని భారము తగ్గజేయుమా. 138.

క. కన్నుల సాఫల్యము గన
బున్నాగ! మిముల గనుచును పుడమిని నెదియో
పున్నెం బంచును జేయుచు
నున్నగ భవదీయగర్భఫలముల గాంతున్. 139.

వ. అనిన విని జయవర్ధనుండు రామకాంతుని దిక్కు మొగంబైన
నాతడును సంతుష్టాంతరంగుండయ్యెను, విషాదానాదితవదనంబు
దేటపఱచి యిట్లనియె. 140.

సీ. బహువిఘ్నంబుల బుణ్యపరమార్థముల ప్రాప్తి
సచివచంద్రుని కటాక్షంబువలన
దుర్భరదుర్నీతి తొలగింపబడె నన్న
సచివచంద్రుని సమాశ్రయమువలన

నిబిడదుర్గంబులు నిర్మింపబడె నన్న
సచివచంద్రుని చేతిచలువవలన
శౌర్యధైర్యోపేతసైన్యంబు సమకూరె
సచివచంద్రుని సుధీశక్తివలన.

తే. గీ. ఇతరపృథ్వీశులు న్దల లెత్త లేర
టన్నచో మంత్రిధీవైభవాగ్నివలన
యిట్టి సచివోత్తముని వీడు టెట్టులయ్యె!
యనుచు రెంటుని మేషము లాగి మరల. 141.

చ. జననము గాంచె బ్రాహ్మణసుజాతికి జెంది తదీయధర్మము
ల్మననము చేసె రూపమున మన్మథు ధిక్కృతి జేసి సర్వశా
స్త్రనయవిశారదుం డనుచు సత్కృతి గాంచియు గర్వ మేమియు
న్గనడు మహాప్రభావు డితగానికి దెల్పెడివార లుండిరే. 142.

వ. అని పల్కి మరల విషాదాచ్ఛాదితచిత్తుండు వలె 143.

ఉ. రెంటుని మేషము ల్వాగచుకీలిని మాటల నాడకుండి పో
నిం డిది యొక్క మంచిపని యో యగు నార్మయకేతువంటి భూ
మండలనేత కల్గుడయి మమ్ముల విస్మరియింపకుండగా
నుండి ప్రజావళిం బ్రజ లోకో! యన నేలుచునుండ గో రెదక. 144.

వ. ఇట్లు తీర్థాభ్యాకాంతులు మాటలాడుచున్నతఱి జయవర్ధనుని
ప్రయాణవృత్తాంతంబు న్విని యా పురప్రజ లాబాలగోపాలముగ
విచ్చేసిరి. 145.

సీ. నేత్రాల దడివెట్టి నేర్పున మునుముందు
మనుజాధిపుని దిట్ట మానువారు
జయవర్ధనుని ప్రశంస నొనర్చుటకు ముందు
నవనీందుని దూషింపనట్టివారు

వనితలు పడబోవు వనటలం జేర్కొని
భూమియందుఁ దిట్టని బుద్ధియుతులు
పార్వమంత్రిని దిట్టి పూర్తి గావించి యా
విభుని దిట్టుట మాని వినచువారు

తే. గీ ఆ జనంబున ముచ్చటైన లేను
మీరు వెడలిన మాబాధ లారయంగ
నెవరు దిక్కయ్య చెప్పు మాకింక ననుచు
జయుని పలదని బతిమాల సాగి రంత. 146.

వ. అట్టి యాప్రజల జయవర్ధనం డుచితకీర్తిని యూరడించి సమాధాన పఱచి పంపివైచి ముఖునా పునయంబున. 147

చ. కతిపయవర్గము ల్గొలువ కంకణపట్టణమేగి దానికిఁ
పతి యయి విష్ణువర్ధనుని వార్తనుబంపియు నందలంబుపై
పితరుల దెచ్చి పూజ నెఱవేర్చుచు వారికి నిత్యమందు! స
న్మతి యయి దానధర్మముల మానక మాన్యుడు జేయు నెప్పుడున్ 149

చ. సతియును దాను సౌఖ్యమయసాగరమందున నోలలాడుచున్
కౌతుకము మీర మన్మథుని కోరిక లీరిక లెత్తజేయుచున్
సుతులను గాంచి వారివలె సుప్రజ నేలుచు దోడిరాజులం
జతిఘనుడంచు బేరుగని హాయిగ వర్ధిలె వర్ధనుండు దాన్. 149.

తృ తీ యా శ్వా స ము,
స ర్వ ము ను సం పూ ర్ణ ము.